కృతిపతి



శ్రీ పాకాల వేంకట రాజమన్నారు

# అంజలి

శ్రీ కరుణాకరుండు పాశాల వంశోద్భవుండు
ఇతడు ఈతడు వేంకటరమణ సుతుడు
రాజమన్నారు రమ్యరమాప్రియుండు
సాధుచిత్తుండుసమతా సఖుండితండు.

వర్తమాన కావ్యకళా ప్రముఖుడితడు
న్యాయమీమాంస సచివోత్తముండితండు
హితుడు, సరస్వతి సరసప్రియావ్రతుండు
మమత మధురసా స్వాదన మాధవుండు.

కావ్యకన్యక కభిమాన కాంతుడితడు
అరయ కావ్యరసస్ఫూర్తి కితడు బుధుడు
సర్వదానంద పరుడు సద్భావయుతుడు
ఉత్తముడు మానవోత్తమ సత్తముండు.

* * * *

నవ్యజీవన మను నిది నాటకమ్ము
కోమల విలాసవాసనా వ్యాపకమ్ము
నిండి నిబిడీకృతమ్మయి నిలచిపిలుచు
కావ్యకన్యక పలుకుల కలిమిగనుము.

ప్రేమపాశాల బంధమీ కామితమ్ము
కాన, కావ్యమ్ము కరుణారసమ్ము సుమ్ము
అంజలి ఘటించి యిచ్చినా నంకితమ్ము
ఆదరముచూపి ప్రేమతో నందుకొమ్ము.

## ఇందులోని పాత్రలు

★

* వెంకటావు
* జనార్దనరావు
* రామారావు
* రామాయమ్మ
* సీత
* సుశి



# పీఠిక

ఇదియొక వ్యంగ్యనాటిక. వ్యంగ్యనాటికయొక్క రచన చాల జాగ్రత్తగా నుండవలయును. ప్రధానముగా నా వ్యంగ్యస్ఫూర్తియే భావించవలెను. ఏమాత్రమటు యిటు మ్రొగ్గినను వ్యంగ్య మంతరించి పోవును. ఇదికత్తిమీది సామువంటిది. సమర్థముగా వ్రాసిన వ్యంగ్యనాటకములు తెలుగులో లేవు. ఇది మొదటిదని చెప్పవలయును. రవీంద్రనాథ ఠాకూర్ యీ వ్యంగ్యనాటిక రచనలో సిద్ధహస్తుడని చెప్పవచ్చును. కాని వట్టి వ్యంగ్యనాటికా రచనాశక్తి చూచినచో యీ నాటకమునందలి శక్తి ఠాకూరుశక్తికి కొంచెము మించియున్నదనవచ్చును. కాని ఠాకూరు రచనలయందుండు ననంతమైన కవితాశక్తి యీ నాటికయందు లేదు.

ఈ నాటకమందు వ్యంగ్యము సులభముగా భాసించదు. జాగ్రత్తగా చదివినకాని తెలియదు. అసలు వ్యంగ్యనాటకముల యొక్క లక్షణమే యిది. ప్రధానముగా కవితాలక్షణమిది: పాఠకు డాలోచించవలయును. కొందరాలోచనకు విముఖులు. కవిత్వములోవలె రాజకీయములలోగూడ నీ రెండు దారులున్నవి. ఒకరాలోచనాపరులు. రెండవవారు సద్యోభోక్తలు. ఈ విషయమే యీ కావ్యవస్తువు. ఒక సిద్ధాంతమున్నది. మొదట మెరుగుగా కన్పించినది. తరువాత తరువాత దాని తరహా వేరైనది.

ప్రథమ సమాగమ భావము పరమ మధురము. పరిణామము క్లిష్టమైనది. వెంకటరావాలోచనాపరుడై నాడు. ఆసిద్ధాంతభూతురాలు. 'సుశీ' యాలోచన వలదనును. అనుభవించుట పరమార్థముగా చెప్పును. ఇది కథావస్తువు.

ఈ ముడిమీద నాటకము పెరిగినది. నాటకముయొక్క చరమస్థితి అనగా నిర్వహణము సమర్థించుట - వృద్ధిపొందించుట, క్లిష్టము సుకుమారము కావలయును.

వెంకటరావు మొదటి సమాగమ మాధుర్యమే వాంఛించును. ఈ వాంఛించుటకూడ పరిస్థితులు మిక్కిలి విషమము కానంతవరకు మిక్కిలిగా విషమించినతరువాత తత్ప్రథమ సమాగమ మధురానుభూతిని స్మరించుట

యందుకూడ కష్టపడును. 'సుశీ' తత్స్మరణయందు నిష్ఠురాలు. వెంకటరావు పాట పాడవద్దనును. ఆమె పాడును. ఆమె పాడుటయే కథయొక్క చరమావస్థ. దానితో వెంకటరావామెను చెంపపై కొట్టును. దానితో నామె లేచిపోవును. ఇది నాటికయొక్క చివర.

సీత మొదటిభార్య. ఆమె విద్యావంతురాలుకాదు. సంప్రదాయములో పెరిగినది. ఆమె తన్ను తానర్పించుకొనుట యెట్లో తెలిసినది. ఇంగ్లీషులో చెప్పినచో తన్నుదా Sacrifice చేసికొనగలిగినది. తనసుఖము పరిత్యజించునది. కాని ఆ సుఖానుభూతి పోయినదని దుఃఖపడకుండ నుండ లేదు. "సుశీ" యాలోచనలేనిది. తనకు సుఖమే కావలయును. ఆ సుఖము కూడ తాత్కాలసుఖము. భవిష్యత్తును గూర్చి యాలోచన యక్కరలేదు. ఆమెకు కావలసిన దొక్కటియే. తాను విద్యావతియై రెండవభార్యగా వచ్చినది. ఆమెనుగూర్చి యెవ్వరును పల్లెత్తుమాట యనరాదు. ఆమెకు వెంకటరావుతో వచ్చిన కష్టమంతయు నీ చిన్నవిషయముమీదనే యాధారపడి యున్నది.

దీనినుండి యేవ్యంగ్యము పుట్టునో అవ్యంగ్యము భావుకైకవేద్యము కావలయును. కాని నేను వాచ్యముచేయరాదు. సూచికగా దీనియందు నొక రాజకీయ సిద్ధాంతముయొక్క నిలుకడయున్నదని చెప్పుదును.

ఈ రచన మొదట నే చెప్పితినికదా కత్తిమీద సామువంటిదని. కథ యేమాత్రమిటు మొగ్గినను యిది సాంఘికనాటకమగును. అటుమొగ్గినచో వాచ్యత సిద్ధించును. దానిని కత్తిమీద నడిపించి వ్యంగ్యము పుట్టించుటలో ననే యీ రచనలోని గొప్పతనమంతయు నున్నది.

ఈ వ్యంగ్యము గాలిలో దీపముపెట్టినట్టులేదు. ఇది పుట్టుటకు రెండువిషయములు నిక్షిప్తములైనవి. మొదటిది వెంకటరావు నాలోచన. రెండవది తెరవెనుక పాడిన పాటలు.

శబ్దశక్తిచేత ఒక్కొక్క శబ్దమునకు ఒక్కొక వాక్యమునకు కలిగిన ప్రభలార్థశక్తిచేత విస్తారమైన యొక యర్థమును వంచించి తచ్ఛబ్దగతశక్తి యర్థమును తనవైపునకు మరల్చుకొనును. వ్యంగ్య మిట్లు మరలుటచేత ప్రబలమైన వాచ్యార్థమప్రధానమగును. కాని వాచ్యార్థము దానియంతట నది పరమరమణీయముగా నుండవచ్చును. ధ్వనితమైనదానికంటె వాచ్యా

ర్థము రమణీయమైనచో దానిని గుణీభూత వ్యంగ్యమందురు. ఇది వాక్య గతమైన విషయము. మహా వాక్యగతమై యిది మరల నిట్లుండును. కావ్య శరీరముమీద వివక్షితమైన మహార్థముకూడ రమ్యముగా నుండుట. దానికొక సహజస్థితి యుండుట. ఆస్థితి తక్కువది కాకపోవుట.

ఆ స్థితి యీ నాటికకు పట్టినది. తెర వెనుక పాటలు బలత్కారముగా లాగుకొన్న యర్థమును వదలినచో నాటిక మిక్కిలి సుకుమారమైనది. నేటి సంఘ సంస్కారవాదులయొక్క యనాలోచితత్త్వము ప్రధాన వస్తువుగా కలదు.

సంస్కారమనినంతనే సిద్ధాంతములయందలి తీవ్రత్వము కాదు. తదాచరణవలన వచ్చు లాభనష్టములు. లోకము తానొకమార్గమున బోవుచున్నది. ఆమార్గమునకు వ్యతిరేకముగా నీవిపని చేసితివి. సంస్కారభావావేశముతో చేసినపని నీకు జీవితాంతము దుఃఖదాయిని కావచ్చును. ఆ భావావేశమును స్మరించుకొని నీవు లోకమును లెక్కచేయకపోవచ్చును. ఆ కార్యములో నీ ప్రోద్బలముచేత నీవెంటవచ్చినవారు తద్భావావేశములో నీకున్నంత తీవ్రతలేనివారు కావచ్చును. అదియు క్లేశదాయకమే. ఈ ముడి సంఘ సంస్కర్తల సర్వకార్యములయందున్నది. దీనిని పరిష్కరించుట యన్నది పెద్ద సమస్య.

నీవు సంస్కారము నారభించితివి. ఆ సంస్కార భావమునందలి ప్రామాణ్య మిట్టిది. నీ వెనుక కొంద రల్ప సంఖ్యాకు లున్నారు. వారే లోకమంతయు నని నీ భ్రాంతి. ఇది మానవునకు సహజమైన భ్రాంతి. నీ వా పనిచేసిన తరువాత కాని నీ సంఖ్య తక్కువని నీకు తెలియదు.

మఱియు నింకొక విషయము. ఒక సంస్కారము నారంభించినపుడు దాని మంచి చెడ్డలు ముందు వెనుకలు సమగ్రముగా పర్యాలోచించి చేయవలయును. ఒక యావేశములో దానిని చేసినచో దానికి దెబ్బ తగులును. ఒకా నొక భావముయొక్క పరిశ్రమ దశారమణీయతకు ముగ్ధులై లోకము వంచించబడుదురు. వారు చేసిన తప్పు క్రియావస్థయందుగాని తమకు తెలియదు. అప్పుడుకూడా కొందరు లెక్కసేయక

చేతిలో నున్నదాని ననుభవించుటయే పరమార్థముగా భావింతురు. ఆలోచనా హీనునకెప్పుడునూ బాధలేదు. ఆలోచనావంతునికే యీ బాధ. ఈ నాటికలోని వస్తు విది.

పాఠకుడు జాగ్రత్తగా చదివినచో నీ వస్తువెంత సుకుమారముగా పోషింపబడినదో తెలియగలదు.

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ,

6-9-52 బెజవాడ.

# పరిచయం

ఈ రచయితను నేను చిన్నప్పటినుంచీ ఎరుగుదును. ఎన్ని దశలు దాటినా, విరోధ భావంతో గానీ, స్నేహభావంతో గానీ, మా జీవితాలకు ఎప్పుడూ సంబంధం వుంటూనే వుంది. అందుకని ఈ రచయితను నేను బాగా ఎరుగుదును.

తాను నమ్మింది సంపూర్ణ సత్యం అనే విశ్వాసంతో, ఇతరులను వొప్పించటానికీ, తాను నడిచిన దారిన నడిపించటానికీ తనకు చేతనయిన ప్రయత్నాలన్నీ చేసే స్వభావం కలవాడు ఈ రచయిత. ఇటువంటి వ్యక్తికి సాంఘిక శక్తుల వొరిపిడి వల్ల, తన నమ్మకం, అందరి నమ్మకాలకు మల్లేనే సంపూర్ణ సత్యం కాదని తెలిసినప్పుడు, అసలు నమ్మటం గానీ, తాను నమ్మిందాన్ని ఇతరులతో వొప్పించటానికి ప్రయత్నించటం గానీ పొరపాటే అనే భావనకు రావటం ఆ క్షణానికి సహజ పరిణామంగానే కనిపిస్తుంది. సడలిన నమ్మకాల ఫలితమే ఈ నాటిక.

ఈ నాటికలోని కథానాయకుడు వెంకటూరావు ఆలోచనాపరుడు. తను చెపుతాడు. తాను చెప్పింది నమ్మమంటాడు. ఈ పద్ధతి ఇతరులలో బాధను రేపితే, తనను క్షమించమంటాడు. కాని ఇతరులు తనకు చెప్పే స్థితికి వొచ్చేటప్పటికి, చెప్పింది వినటంలో వున్న బాధ అప్పుడతనికి

అవగత మవుతుంది. విసుగుకుంటాడు! బాధ పడతాడు! అర్థంలేని చూపు ల్లోకి దిగుతాడు. చెప్పినవాళ్ళని తన ముందునుంచి వెళ్ళిపొమ్మంటాడు. తాను లేపిన శక్తులు మరొక అర్ధసత్య ప్రిభావంతో తన్నావరించినప్పుడు, క్షమాపణ చెప్పుకునో, విసుగుకొని వెళ్ళగొట్టో వాటినుంచే తన్ను తాను కాపాడుకోటానికి ప్రయత్నిస్తాడేగాని, వాటిని తన పూర్వ నమ్మకంతో సమన్వయ పరచుకొని అభివృద్ధి చెందడు. తన సృష్టికి తానే భయపడే ప్రికృతి అతనిది.

అతని ఇద్దరి భార్యలూ అతని మాటలు వింటారు. : నమ్ముతారు. ఇద్దరూ భర్తని ప్రేమించినవారే. భర్తతో సుఖంగా కాపురం చెయ్య దలచినవారే! అలా కాపురం చెయ్యటానికి వీలుంటుందనే ఉద్దేశ్యంతోనే భర్తమాటను నమ్మినట్లు కనిపిస్తారు. మొదటి భార్య సీత అతని మాటలు పూర్తిగా నమ్మింది. ఈ నమ్మకంలో హిందూ పతివ్రితల మనస్సుల్లో నిత్యం కదులుతూ వుండే 'భర్తకోసం, అతని ఆనందంకోసం త్యాగం చెయ్యటం' అనే భావన ఎంతవరకు పనిచేసిందో నేను చెప్పలేను. రెండవ భార్య సుశి ప్రవృత్తి వేరు. ఆమె అతని మాటలు నమ్మటానికి హృదయ పూర్వకంగా ప్రయత్నించింది. కాని నమ్మలేక పోయింది. అందుకనే ఎప్పటికప్పుడు 'మీరు నాకు అర్థంకాకుండా పోకండి' అని కోరింది. అందుకనే అతన్ని పూర్తిగా నమ్మలేకపోబట్టే ఆమె అతను తనకు తెలియ కుండానే తమ చుట్టూచుట్టిన విషయంలోనుంచి త్వరగా బయటపడ గలిగింది.

అతని భార్య లిద్దరూ అతని ప్రేమను కోల్పోకుండా వుండటానికి అతని మాటలు నమ్మారు. స్వసుఖంకోసం తమ్మి తాము మోసగించు కున్నారు. ఏది కోరి అతని మాటలు నమ్మారో, నమ్మటానికి ప్రయత్నించారో, అది లేకుండా పోతున్నప్పుడు పశ్చాత్తాప పడ్డారు...వెంక టాప్రిఫుతల్లి రామాయమ్మ నమ్మకాల్లో ఇటువంటి స్వార్థం లేదు. కొడుకూ కోడలూ సుఖంగా వుంటమే ఆమెకు కావలసింది....అందుకని కొడుకు నమ్మకాలకు ఆమె మొదటినుంచి చివరివరకూ ఎదురే....కొడుకు నమ్మకాలు ఆమెను ఏమాత్రిం కదల్చలేక పోవటంలో ఆశ్చర్యం లేదు.



మనం ప్రపంచాన్ని మన ఇంద్రియాల ద్వారా తెలుసుకుంటున్నాం. అంటే ఈ తెలుసుకోవటంలో మన దృష్టి అనేది వొకటి ఎప్పటి కప్పుడు ఉంటూనే వుంది. అంటే మనం సత్యాన్ని సంపూర్ణంగా తెలుసుకోలేకపోతున్నాం. సత్యాన్ని తెలుసుకోటానికి ఏ సాధనాన్ని వుపయోగిస్తున్నామో ఆ సాధనానికి సంబంధించిన కొన్ని లక్షణాలు మనకు తెలిసిన సత్యంలో ఎప్పుడూ మిళిత మయ్యే వుంటై. అందుకని అదీ నీవూ వొకటైనప్పుడు తప్ప సంపూర్ణ సత్యాన్ని తెలుసుకోలేం అంటారు ఆధ్యాత్మిక వాదులు.' కాని 'ఆలోచనాపరులు ఈలోగా ఏంచెయ్యాలి?' అనేది ప్రశ్న. సంపూర్ణ సత్యం అనేది ఎవ్వరికీ తెలియదు గనక వొకరు చెప్పటం అనేదీ వొకరు వినటం అనేదీ వుండగూడదా? పరిపూర్ణ మానవుడు తప్ప ఇంకెవ్వరూ ప్రచారానికి దిగగూడదా? అలా దిగటంవల్ల లోకపీడనేగాని లోక శ్రేయస్సు జరగదా? ఈ నాటిక చదివినప్పుడు ఇటువంటి ప్రశ్నలు ఈ రచయితను చాలా కలవరపెట్టినట్లు స్ఫురిస్తుంది. ఒక్క ఈ రచయితనేకాదు – ఆలోచనాపరుల్నందర్నీ కలవరపెట్ట గలిగిన ప్రశ్నలే ఇవి.

మానవుడు జితేంద్రియు డయ్యే వరకూ, అంటే సంపూర్ణ సత్యాన్ని తెలుసుకునే వరకూ, చెప్పటానికి పూనుకోగూడదనుకోవటం బొత్తిగా కుదరని విషయం. జీవితంలో చెప్పే అవుసరం చెప్పించుకునే అవుసరం ప్రతినిత్యం కలుగుతూనే వుంటుంది. దీనినుంచి మనం తప్పించుకుందామన్నా తప్పించుకోలేం. కాకపోతే చెప్పేవాళ్ళూ చెప్పించుకునేవాళ్ళూ అనే విభజన మాత్రం ప్రమాదం. చెప్పినవాడు చెప్పించుకుంటున్నాడు. చెప్పించుకున్నవాడు చెపుతున్నాడు....ఈ నాటికలో మొదట్లో కథానాయకునితో మాటలు చెప్పించుకున్న పాత్రలు పోనుపోనూ, తాము కథానాయకునికి చెప్పటం మొదలు పెట్టినై...చెప్పే కథానాయకుడు చెప్పించుకునే కథానాయకుడుగా మారాడు....ఇది గమనించ దగిన విషయం.

ఈ లోకంలో మానవులకు చెప్పటం తప్పదు. చెప్పించుకోవటం తప్పదు. ప్రతి వ్యక్తీ "చెప్పేవాణ్ణీ నేనే చెప్పించుకునేవాణ్ణీ నేనే" అను

కోగలిగితే, సంపూర్ణ సత్యాన్ని ప్రచారం చేయలేకపోవటం వల్ల వొచ్చే ప్రమాదం కొంత తగ్గుతుంది.



ఈ రచయిత సాహసుడు. అందరం అర్ధసత్యాలతో తికమక పడుతున్న వాళ్ళమే గనకా, ఎవరికి వాళ్ళు తమ అనుభవం వల్ల కలిగినదృష్టితో సత్యస్వరూపాన్ని నిర్ణయించుకునే వాళ్ళే గనకా, వొకరికి వొకరం చెప్పటం, మన దృష్టికి అనుకూలంగా మిగిలిన వాళ్ళను 'సర్దుకో'మనటం అన్యాయం, ప్రమాదం అని చెపుతూ, నూతనంగా తనకు గలిగిన ఈ దృష్టికి అనుకూలంగా మనల్ని సర్దుకోమంటున్నాడు, జాగ్రత్త!!

టి. గోపీచంద్,
ఆంధ్రప్రభుత్వ సమాచార
ప్రచార శాఖాధిపతి.

# అభిప్రాయం

ఈ ప్రతీక్షా నాటిక కేవల మొక సాంఘిక రూపకము. ఇందలి కథావస్తువు పూర్తిగా కల్పితమే. అయినా నేటి సాంఘిక జీవిత పరిస్థితులను అద్దమువలె ప్రతిబింబింప జేస్తున్నది. క్రొత్త పాతల సంధియుగముగానున్న నేటి సాంఘిక జీవిత మంతా సమస్యలతో నిండియున్నది. కొందరు వయోవృద్ధులు పూర్వాచారపరాయణులై గతానుగతికములైన సంప్రదాయములను విడిచిపెట్టుకోలేరు; సరిగదా, ఇతరులు విడిచిపెట్టుకొనడం చూచి సహించలేకుండా ఉన్నారు. అందుకు దృష్టాంతంగా ఈ నాటికలో రామాయమ్మ కనబడుతున్నది. కొందరు ప్రాత సంప్రదాయములను విడిచిపెట్టడంలో ముందడుగు వేసినా క్రొత్త సంప్రదాయములను అవలంబించడంలో కావలసిన సంస్కృతి లేకపోవడంచేత ఆత్మప్రత్యయం, ధైర్యసాహసాలు లేకుండా బాధపడుతున్నారు. అందుకు రామాయమ్మ కొడుకు

వేంకటరావు దృష్టాంతముగా కనబడుతున్నాడు. సంప్రదాయాలు మారినా చాలామందికి మానసిక దౌర్బల్యము ఎప్పటిలాగే ఉన్నట్లు సీత, సుశీల నిరూపింపబడినారు. ఇద్దరున్నూ స్వార్థపరత్వము గలవారే. రెండు కత్తు లొక ఒరలో దూరజాలవన్నట్లు ఈ సవతు లిద్దరును కలిసి యుండలేరు. కాని, వారిలో ఒక తేడా కనబడుతున్నది. పతిభక్తి యథావిధిగా వివాహితయైన సీత కున్నట్లు ప్రేమించా ననుకొనే సుశీలకు లేదు. పతి తనను పుట్టింటికి పంపివేసినా సీత తన పతి వద్దకు వచ్చి అనుకూలవతి కావడానికి ప్రయత్నిస్తుంది, సుశీల తనను మోహించి తెచ్చుకొన్న వేంకటరావు తనకు స్వతంత్రత ఇచ్చి కేవలము తనతోనే ఉండవలెనని కోరుతుంది; తన కోరికకు ఏ మాత్రము లోపము కలిగినా సహించలేదు. తనకు నచ్చజెప్పిన మాటలను నిలబెట్టుకోలేని పతిని నిందిస్తుంది. తనకు మోసము కలిగినట్లు నిస్పృహచెంది దుఃఖిస్తుంది; వేంకటరావు సౌఖ్యములకు హాని కలిగించే భావములు గల పాట పాడి అతని ప్రాణము విసిగింపజేస్తుంది. కథానాయకుడైన వేంకటరావు దక్షిణనాయకుడు కాలేకపోయినాడు. సీత యెడల ప్రేమలేదు. అనుకంపమూ లేదు. సుశీల యెడల మోహమే కాని ఆమెకోసము తన అహంకారమును, అధికారమును త్యాగంచేసుకో లేదు. ఆమెను విడిచిపెట్టుకోలేదు; ఉంచుకోలేదు. అతనికి గల నూతనాశయము లన్నీ పైపూత మెరుగులే కాని సంస్కృతి విలసితములు కావు. హృదయ మంటూ ఒకటి తనకు ఉన్నదా అనునట్లు అతడు సీత యెడలను సుశీల యెడలను వ్యవహరించాడు. తుదకు సుశీల యెడల అత్యాచారమునకు కూడా ఉద్యుక్తుడయినాడు. తల్లి యెడల అతనికి గౌరవము లేకపోయినా ఆమెకు దుఃఖం కలిగించినా ఆమె యెడల అత్యాచారమునకు పూనుకొన లేదు. రామాయమ్మ పూర్వాచారపరాయణ యైన వృద్ధురాలు గనుక తన కుమారుని నూతనాశయములను గాని సుశీలయొక్క మనోభావములను గాని అవగతం చేసుకోలేదు. అయినా ఆమె హృదయం కోమలమైన స్త్రీ హృదయం. సీత యెడల పూర్తిగా అనురాగం, అనుకంపం గలది. సుశీలను ద్వేషించినా ఆమె యెడల వేంకటరావు అత్యాచారమును జరుపునప్పుడు చూచి సహించలేక పోయినది. ఈ విధముగా వేర్వేరు గుణములు గల

పాత్రములను సృజించి, అందలి ప్రత్యేకతను నిరూపించుటలో గ్రంథకర్త గారు సిద్ధహస్తులైనారని అభినందిస్తున్నాను. పాత్రోచిత భాషవలన పాత్రపోషణము మరింత చక్కగా సాగినది. భావములను వ్యక్తపరచుటకు తగిన భాష ప్రయుక్తమయినది.

వ్యంగ్యము మొత్తముమీద నాటికయందంతటను వ్యాపించి యున్నది; వ్యంగ్యార్థము కొన్నిచోట్ల - అందులోను ఎక్కువగా తెర వెనకనుండి వెల్వడే పాటలలో ప్రధానముగా ఉండడంచేత ధ్వనిగా పరిణమించినది; మరికొన్నిచోట్ల అప్రధానము కావడంచేత గుణీభూత వ్యంగ్యంగా ఉన్నది.

ఈ నాటికలో గల రచనా చమత్కృతి పాఠకుల సంస్కృతిని బట్టి అవగతము కాగలదని నా నమ్మకము. రంగస్థలమున ప్రయోగింపబడి నప్పుడు ఇది జనసామాన్యమును రంజింపజేయలేక పోవచ్చును. అందుకు కారణము ప్రేక్షకుల సంస్కృతి లోపమేకాని గ్రంథకర్త రచనా లోపము కాదని నా అభిప్రాయము.

ఇటువంటి నాటకములు రచించడము చాలా కష్టము. అట్టి కష్టమైన పని సాగించి గ్రంథకర్తగారు కృతకృత్యులైనందుకు వారిని అభినందిస్తూ ఇంకా ఇటువంటి సాంఘిక నాటకములను రచించే అవకాశములను భగవంతుడు ప్రసాదించును గాక అని ప్రార్థిస్తున్నాను.

డా॥ గిడుగు వేంకట సీతాపతి బి. ఎ. ఎల్. టి.

డి. లిట్

తెలుగు భాషా సమితి

# ముందు మాట

శ్రీ చదలవాడ పిచ్చయ్యగారిని సహృదయులుగా, కర్మవీరులుగా ఎరుగుదును నేను. ఇప్పుడు నాటికారచయితలుగా గుర్తిస్తున్నాను. చెప్పడానికి ఒక సందేశముండి, నడపడానికి మానవప్రకృతి విజ్ఞానముండి, అతిచెయ్యకుండా ఒక నిండు దృశ్యాన్ని సృష్టించడము కష్టమైన పని అయితే శ్రీ పిచ్చయ్యగారు అది సాధించారు. 'సంస్కారాలూ' 'ఆదర్శాలూ' వ్యక్తిస్వార్థము వేసే అందపు అవతారాలంటున్నారు వారీనాటకంలో. ఈ సందేశాన్ని పాత్రల వర్తనమువల్ల చక్కగా దిద్ది తీర్చారు. పాత్రలన్నీ ఒకటో ఆరో తప్ప చరపాత్రలు. అనుభవాలతో ఎదుగుతాయి. సంప్రదాయాన్ని పాటిస్తూండడమే జీవితములో సుఖవంతమని నమ్మే రామాయమ్మ, ఆమె అన్నగారు జనార్థనరావూ స్థిరపాత్రలైనా నాటకపు నడకకి తగురీతిని దోహదము చేశారు. సంప్రదాయమూ స్వార్థమూ అనే రెండు తిరగటిరాళ్ళమధ్యన సీతమ్మ నలిగిపోతే, స్వార్థమే నమ్ముకుని మోసపోయిన సుశీల వెంకట్రావు అభినయించిన ఆదర్శప్రేమకి వేషము ఊడలాగి అతని పచ్చిస్వార్థాన్ని కసితీరా వెక్కిరించింది. తన లాలసకి ప్రేమ చీరకట్టి సుందరిని చెయ్యాలని తంటాలు పడ్డ వెంకట్రావు స్వార్థము కొలము రాగానే చీర పారవేసి రాక్షసరూపాన్ని చూపించింది. పాతివ్రత్యపు కిరీటము నెత్తికి వస్తుందని స్వార్థానికి ముసుగు కప్పి సుశీలను తన భర్తకు వివాహము చేసిన సీతమ్మ తనస్వార్థము ముసుగు తీశేసుకోవడంతో కుమిలిపోయి ఆ సుశీలముందే తనగోడు వెళ్ళగక్కుతుంది. దొంగ అభిమానాన్ని నమ్ముకుని సంఘమర్యాదల్ని తృణీకరించి వెంకట్రావుని వివాహమాడిన సుశీల నురుగువెడలిన వ్యక్తిస్వార్థాన్ని గుర్తించి "కరుణించువారెవరు కనుచూపులో లేరు" అని గుండెవిప్పి విలపించింది.

ఈ నాటికలోని పాత్రలు మనుష్యులే; మనస్సులు కావు. కవి వారివారి ప్రవర్తనలను పుణికిపట్టైనుగాని తనకు కావలసినట్లు నడిపించుకో లేదు. వాదనలలో మానసత్వముతోపాటు మానవత్వాన్ని మేళవించి కవి చక్కని వాస్తవికతను చేకూర్చెను. సంఘనీతికీ వ్యక్తిస్వార్థానికీ నేడు జరిగే సంఘర్షణలో సత్యాన్ని చక్కగా బయలుపెట్టగల "ప్రతీక్ష" వంటి నాటికలు చాలా అవసరము.

చెన్నపట్టణము
26-7-55

డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

# నా మాట

పరిణామంలోనే క్లేశాన్ని కల్పించే ఇంద్రియలోలత్వము, సంకల్ప వికల్పాలు, మానసిక ప్రవృత్తులు, యథాతథంగా చిత్రించినప్పుడు భావం కూడా చంచలమైన దవుతున్నది. తీరని కాంక్షలను వర్ణించి ఆశలు రేకెత్తించడం అశాంతికి కారణ మవుతున్నది. అజ్ఞానజన్యమైన ఈ ప్రతీక్షవల్ల విచికిత్స కలిగి వికాసానికి సోపాన మేర్పడుతుంది. విశృంఖలమైన మనస్సు, సంకల్ప, వికల్ప ప్రళయతాండవము తేరుకుని వివేకం కలగడమే సంస్కారానికి మొదటి మెట్టు. అసంస్కృతములైన సంకల్ప వికల్ప చిత్రణము చిత్రకావ్యము.

మనోతీతములు బుద్ధిస్థములు పరిణామరమణీయములు అయిన భావాలను గ్రహించి వానికి రూపకల్పము వ్యంగ్య కావ్యము. సంకల్ప వికల్పాలు కాకుండా ఆలోచింపబడిన భావాలే ఇందు చిత్రింప బడతాయి. ఇది సంస్కారానికి రెండవ సోపానము.

భావము సంకల్ప వికల్పాలనుదాటి వివేకముచే గ్రహింపబడి చిత్తాన్ని ఆకర్షించినప్పుడు ఆ భావము స్థిరమై సంస్కృతమై పరిణామ రమణీమై హృద్యమైన దవుతున్నది. అ రూపములైన ఈ భావాలకు రూపకల్పనమే కళ. భావాలంబనకు నాయకాదు లుపకరిస్తారు. కాని భావశుద్ధి సంస్కారమును వ్యక్తీకరించే స్థిరభావాలే అభివ్యక్తములవుతాయి. ఇలాటి కావ్యమే ధ్వనికావ్యము. ఇది మూడవ సోపానము. భావశుద్ధి లేనప్పుడు కలిగే అశాన్తిని చిత్రించడము వ్యతిరేక ప్రదర్శన మవుతుంది.

ఈ ప్రతీక్ష వ్యతిరేక ప్రదర్శనము. సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు ఇంద్రియ చాపల్యానికి లొంగి సంస్కారము లేక చాపల్యమే సంస్కార మని భ్రాన్తిపడి మధురానుభూతి అని మోసపోయి సుశీ వేంకటరావులు విశృంఖల వృత్తికి దిగజారేరు. ప్రేమబద్ధమైన కుటుంబంలో హాలాహలం ప్రవేశించి అశాన్తి తెచ్చింది. తల్లి, మామ, స్నేహితుడు, భార్య, సంఘము అంతా దూరమై తనవి తనవి కాకుండా పోయేయి. వాటిని శాశింపలేక, ఆదుకోలేక తపనతో ఆత్మనిందతో బెదరింపులతో బెదరి చేయి చేసికొనే పశుత్వంలోకి దిగజారి దిక్కారంతో నాశానికి దోవతీస్తుంది. ఇంతకూ చాపల్యమే కారణము. సంస్కార విహీనత్వమే కారణము.

ఈ అశాన్తికి భౌతిక వస్తువులుగాని ఆర్థిక రాజకీయాది విషయాలుగాని కారణం కాదు. భౌతిక వాదు లూహింపలేని విషయమిది. సంస్కృత చిత్తులు రసస్పందిత హృదయులగువారికి మాత్రమే స్ఫురించే విషయమిది. తనకు ఆయతనమైన దానిని తెలియకుండా తపనపడితే శాన్తి లేదు గదా! తనను తా నర్థము చేసికొనిన తపన లేదు. అందులకే ప్రతీక్ష.

"కనురెప్పపాటు మన కనుపాప కలసెను అని ఆరంభించి" "కరుణించువారెవరు కనుచూపులో లేరు." అని అంతమగుట మధురస్మృతితో ఆరంభించి మధురమా మాస్మృతికి మరణమే వ్రాసెనో అని అంతమగుట మధ్యనుండు ఆరోహణావరోహణ క్రమము ప్రత్యేకముగ గమనింప తగినవి.

జీవిత సౌందర్యము, ఆనందము, సంస్కారము లేని జీవితమునకు ఫలిత మిది. ఆ మూడును లేనివారికీ కావ్యము మాటల గుట్ట. పరిణిత ప్రజ్ఞులకీ భావగ్రహణము హృదయస్పందన హేతువు. నాటికా లక్షణములు శిల్పము, మొదలగు విషయము లన్నియు భావానుగములగును గాన వాని విషయ మంతగ ప్రస్తావించను.

చాపలేరిత కావ్య నిర్మాణానికి కాకుండా సంస్కృతీ బద్ధ విషయ నిరూపణమునకు వాక్కు నుపయోగించుట శ్లాఘ్యమార్గము. సంస్కారమని పొరబడి లేక ఇంద్రియ లోలురై రాజకీయము, సంస్కారము అనే ముసుగులతో వివాహ మాడినవారిలో అనేకు లీ అశాన్తికి లొంగుట లోకానికి అనుభవైక వేద్యము – అదే కావ్య వస్తువు.

విజయనగరం
5–10–52.

అ. నరసింహశర్మ

# తుది పలుకు

ఇది సంధియుగము. పాత సిద్ధాంతాలలో నమ్మకంలేదు. కొత్త సిద్ధాంతాలు విస్పష్టరూపం సంతరించలేదు. అందువల్ల సాహిత్యాది వివిధ రంగాలలో తలకొక సిద్ధాంతంగా ఉన్నది. ఒక్కొక్కరు ఒక్కొక్క సిద్ధాంతాన్ని పురస్కరించుకొని వస్తున్న రచనలను పరిశీలిస్తున్నారు. బాగోగులను నిర్ణయిస్తున్నారు. ఇలా ఒక నిర్దిష్ట సిద్ధాంతాన్నిబట్టి కృతి మంచి చెడ్డలను నిర్ణయించడం సౌందర్య తత్త్వానికే గొడ్డలిపెట్టు. ఎందువల్లనంటే రామణీయకం నిత్యనూతనం, అనన్యం అనంతం. దాన్ని సూత్రాలనుబట్టి నిర్ణయించడానికి పూనుకొంటున్నపుడు ఆ నిర్ణయమున వస్తువు మరేమన్నా అవుతుందేమోకాని రామణీయకంమాత్రం కాజాలదు.

కాబట్టి రామణీయకాన్ని ఆస్వాదించి ఆయాస్వాదనకు అర్థం తేల్చాలంటే ఉన్న సిద్ధాంతాలను అన్వయించి ఆ సిద్ధాంతాలకు అందితే ఆ రచన రమణీయమని, అందకపోతే రమణీయం కాదని చెప్పరాదు. నేడు ఈ పొరపాటే జరుగుతున్నది. కొందరు రసవాదాన్ని; కొందరు వాస్తవికతా వాదాన్ని మరికొందరు అధివాస్తవికవాదాన్ని, ఇంకా కొందరు మార్క్సిజాన్ని, మరికొంతమంది సత్తావాదాన్ని. మరికొందరు ప్రయోజనవాదాన్ని పురస్కరించుకొని బాగోగులను నిర్ణయిస్తున్నారు ఈ విధానం రామణీయకానికి రచయితకు మహాపచారం చేస్తున్నది. దీనిని అవలంభిస్తున్న వ్యక్తికూడా ఆత్మవంచన చేసుకొంటున్నాడు. రామణీయకాన్ని అనుభవింపలేక జీవితాన్ని నిరర్థకం చేసుకొంటున్నాడు. జిజ్ఞాస సౌందర్య దిదృక్ష లేకపోతే మానవునికి జంతువుకూ తేడా యేమున్నది?

కాబట్టి సౌందర్యదిదృక్ష మానవునికి ఆవశ్యకం. ఈ దిదృక్ష చరితార్థ కావాలంటే ఒకటేమార్గం. అతడు సహృదయుడు కావాలి. వర్ణనీయమందు తన్మయీ భావయోగ్యత సంపాదించాలి. దీనికి వెనకటి కావ్యాల అనుశీలనము మాత్రమేకాదు. ప్రకృతం చదువుతున్న రచనయందు తన్మయీభావం పొందగలిగి ఉండాలి. ఈ తన్మయతకు ఆత్మ సంస్కృతి, కృతియందు ఆశక్తి కావాలి. ఈ రెంటిలో ఏది లోపించినా రామణీయకం కూడా లోపిస్తుంది. అయితే యీ లోపం ఎక్కడ ఉన్నది. ఆత్మ సంస్కృతిలోనా? కృతిశక్తి రాహిత్యంలోనా అన్నదే క్లిష్ట సమస్య.

సాధారణంగా ప్రతి వ్యక్తికీ తాను సహృదయుడ నని - నిశితంగా చూడగల ననీ, అందువలన తన పొరపాటు ఉండదనీ అనుకుంటాడు. ఈ రామణీయకం గోచరించనప్పుడు ఈ అహమిక దోషమంతా రచనలోనే ఉన్నదంటుంది. తన్ను సమర్థించుకోవడం కోసం సూత్రాలను ఉదహరిస్తుంది. తాను ప్రామాణికులనుకొన్నవారి పంక్తులను ఏకరువు పెడుతుంది. ఇలా అప్పగింపబడే వాక్యాల ప్రామాణికత్వాన్ని ప్రశ్నించినప్పుడు విమర్శకున కేర్పడే స్థితి నిజంగా ఊహించుకోవలసిందే తప్ప చెబితే తెలిసేది కాదు. ఇంతకూ రచన బాగోగులను పాఠకుని ఇష్టానిష్టాలను అధిగమించి చెప్పుకోవటానికి వీలువేదా, అంటే లేకపోలేదు. ఉన్నది. పాఠకుడు ముందు రచనలోని ఏకత్వము చూడటానికి ప్రయత్నించాలి. దానిని శోధించి, సాధించి, చూచిన తరువాత ఆ రచనను గూర్చి అతడు ఏమైనా చెప్పటానికి అధికారం ఉన్నది. అలా చెప్పిన దానికి విలువ ఉన్నది. ఆ ఏకత్వం గోచరించనప్పుడు ఆ రచన బాగోగులను గూర్చి ఇదమిత్థమని నిర్ణయించి చెప్పటానికి ఆ పాఠకునికి అధికారం లేదు. కాకపోతే తనకు వ్యక్తిగతంగా ఆ రచన నచ్చలేదనో, బాగున్నదనో అనుకోవచ్చును. దాని కేలాంటి ఆక్షేపణా ఉండదు. అయితే ఆ అభిప్రాయం వ్యక్తిగత అభిప్రాయమే అవుతుందికాని ప్రామాణిక వచనం కాదు.

ఈపైని చెప్పిన అంశాలనే ప్రతీక్ష అన్న ఈ రచన అక్షరం అక్షరం రుజువు చేస్తున్నది. ప్రాచీనులు చెప్పుకొన్న రూపక లక్షణానికి కాని, భాషాధిక సాంప్రదాయాలకు కాని ఇది ఎక్కడ అందదు. అంతమాత్రం చేతనే ఈ రచన నీరసమనికాని నిరర్థకమనికాని అనటంలో అర్థంలేదు.

ఇంతకు ఈ రచనను ఎలా చూడాలి ? ఇందులో ఉన్న విశిష్టత ఏమిటి ? దీని బాగోగులను నిర్ణయించటం ఎలా ? ఈ ప్రశ్నలకు సమాధానం ఈ క్రింది ప్రశ్నలమీద ఆధారపడి ఉన్నది:—ఇందు చిత్రింపబడ్డ అంశా లేమిటి ? వేనిని ఆక్షేపించి ఇవన్నీ ఒకచోట చిత్రితమవుతున్నవి ?

వెంకటారావు సంస్కారాభిలాషి. మొదటి భార్య అయిన సీతను ఒప్పించి సుశీలను పెళ్ళిచేసుకుంటాడు. సుశీల మొదట కొన్ని అభ్యంత

రాలను సూచిస్తుంది. కాని వెంకట్రావు అలాంటి వేవి ఉండవని నమ్మించి పెండ్లాడుతాడు. ఆమెకోసమని సీతను పుట్టింటికి పంపించివేస్తాడు. ఆమె భర్తకోసమని ఇష్టపూర్వకంగా వెళ్ళిపోతుంది.

అయితే వెంకట్రావుతల్లి పాత సాంప్రదాయాల మనిషి. సుశీల అన్యవర్ణ సంభూత. కొత్త కోడలికి ఎంత విద్య ఉన్నా, ఎంత సంగీతజ్ఞాన మున్నా ఏమి ప్రయోజనం? వంశగౌరవం మర్యాద ఒక్కసారి గంగలో కలుస్తూ ఉంటే ఎలా సహిస్తుంది? అందువలన ఆమె సుశీలను నానా మాటలు అంటుంది. తనకు వీలైనంత వరకు వెంకట్రావు అడ్డగించలేనంత వరకు నొప్పిస్తుంది. ఎలా నొప్పించిందో, ఏమి చేసిందోమాత్రం మనకు తెలియదు. అలాంటి దేదో జరిగి ఉండాలని సుశీల మాటలు మనకు ద్యోతకం చేస్తుంటాయి. అత్తగారి ప్రవర్తన సుశీలకు దుస్సహమవుతుంది. ఆ కష్టాన్నే వెంకట్రావు వద్ద వెళ్ళగక్కుతుంది. అతడు తన చేతనైనంత వరకు అడ్డుపడుతున్నానని ఆమెకూడా కొంత సర్దుకు పోవాలని ప్రతి మాలు కొంటాడు.

ఇంతలోనే వెంకట్రావు మామ వస్తాడు. జనార్దనరావు తన హితం కోరే మనిషి అని తన కన్నిటా చేదోడు వాదోడుగా ఉంటున్నాడని వెంకట్రావు నమ్మకం. అతడు కూడా సుశీలనే అంటాడు. సుశీలకు నిప్పుల్లో పొరలినట్లవుతుంది. తల్లి మాటల్లో అణుమాత్రం గౌరవం చూపించని వెంకట్రావు తన మామ మాటలను సానుభూతితో చూడా లని తమ శ్రేయస్సే అతను ప్రధానంగా ఎంచేవాడు కాబట్టి అతని మాట లకు బాధపడక సర్దుకు పోవాలని బహు విధాల ప్రాధేయపడి చెప్పి ఎలాగో ఒకలాగున సుశీలను ఒప్పిస్తాడు.

కాలం గడుస్తూ వుంటుంది. సుశీల కొత్త పాటను సాధిక చేసింది. ఎంతోకొంత వెంకట్రావువల్ల సుఖం పొందింది. అతని మిత్రుడు రామా రావు వచ్చి ఆమె పాడిన కొత్త పాటవిని మెచ్చుకొంటాడు. ఆ పంప తులు అనుసరిస్తూఉన్న సంస్కారణను వర్ణించడానికి శక్తి చాలదన్నంతగా ప్రశంసిస్తాడు. వెంకట్రావు ఒక్కసారి విరుచుకుపడతాడు. సంస్కారం, అభ్యుదయం, ఆనందం, శ్రేయస్సు అన్నవాటిని ప్రశ్నిస్తాడు. దీనికి అంతకూ కారణమేమిటి? ఏది ఎలాఉన్నా కమ్యూనిష్టు సిద్ధాంతాలలోను

కార్మికుల నినాదాలలోను అర్థం కనిపించదు. వెంకట్రావు మాత్రం యవరి సమస్యలలో వారు సతమతమవుతున్నారు కాబట్టి యితరుల సమస్యలను అంత తేలికగా చూడవద్దంటాడు.

భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతున్నదికదా. ఆ అలవాటుచొప్పుననే కొన్నిసార్లు తన చుట్టూ తిరిగింది. సూర్యుని చుట్టూ అప్పటికింకా ఒక్కసారి అయినా పూర్తిగా తిరిగిందో లేదో తెలియదు. సీత తిరిగి భర్త దగ్గరకు వస్తుంది. ఎందుకు వచ్చింది ? పుట్టింటివారు ఆమెను అనవలసిన మాటలన్నీ అన్నారు. చేయవలసిన అవమానాలన్నీ చేశారు. ఆమెకు జ్ఞానోదయ మయింది. తాను మనిషే. మానవలోకంలోనేఉంది. తనకూ కోర్కెలున్నాయి. ఆ కోర్కెలు చంపుకొని బ్రతకలేదు. వెంకట్రావు సన్నిధానంలో ఉందామని వచ్చింది. లోగడ సుశీలా వెంకట్రావుల పెండ్లికి సమ్మతించిన మాట వాస్తవం. కాని ఆనాటి మాటలన్నీ వెంకట్రావుని కాకపోతే వాటిని తననోటిమీదున చెప్పింది. ఇక యెలాగో సర్దుకొని జీవించటానికి ప్రయత్నించటమే ఆమె లక్ష్యం.

కాలవాహిని సాగుతూ ఉంటుంది, సుశీలకు అన్ని వైపులా సమస్యలే. సీత ఏడుపు ఒక ప్రక్కన. అత్తగారి సూటిపోటీలు మరొక ప్రక్కన. అయినవాళ్ళకానివాళ్ళఎత్తిపొడుపులు ఇంకొక ప్రక్కన. ఆమెకు జీవితం దుర్భరంగా కనిపిస్తూవుంది. సీత వచ్చి సర్దుకొని ఎలాగో బ్రతుకుదామని అంటుంది. సుశీల హృదయం భగ్గుమంటుంది. సీత అనునయించటానికి ప్రయత్నిస్తుంది. "వారు నీవారే, నీతరువాతే నావారు" అని స్పష్టంగా చెబుతుంది. తనబ్రతుకు వేరాలపాలు కావటం వెంకట్రావును ఆపాదమస్తకం కాల్చివేస్తుంది. తన దగ్గర సుశీల సీత, తల్లి రామాయమ్మ లేకుండా తరిమివేస్తాడు.

స్థితిగతులు ఇలా విషమిస్తాయి. సర్దుకు పోదామని చెప్పే సీతకు నైరాశ్యమే. "అశ్రువులే నా కండదండలా, అనాదరమె నా ఆదరమా" అనకుండా ఉండలేక పోతుంది. సుశీల స్థితికూడ ఇంతకు ఏమాత్రం భిన్నంకాదు.

కరుణించువా రెవరు కనుచూపులో లేరు
ఆదరణచూపవా ఆర్ద్రితా పతనమా
నా వలపు నా చెలిమి నట్టేట ముంచెనా
నావలో ననుగాచు నాథుడే వీడెనా
మధురమౌ మాస్మృతికి మరణమే వ్రాసెనా

ఇవే ఆమె హృదయం చుట్టుకొని వెలువడే దుర్భర ధూమశిఖలు. ఇవి వెంకట్రావును ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. సీత మళ్లా అందు కుంటుంది.

మనమన బంధనమ్ము లిక మానసమందున దాగియుండునో
... ... ... ... ... ...
వినివినరాని దూషణ విశేషణముల్ వినిపించుచుండునో.

దీనితో వెంకట్రావు కోపం బట్టబయలవుతుంది. "మీ రిద్దరూ నన్ను చంపేస్తున్నారు. మీకు పరువు మర్యాద పట్టలా. ఇప్పటికే నన్నందరూ అవహేళన చేస్తున్నారు. అన్ని రకాలుగా ఎత్తిపొడుస్తున్నారు. నాకున్న గౌరవం పోయింది. మర్యాద పోయింది, నన్నందరూ చులకనగా చూస్తున్నారు......ఇప్పటికే అనేక వదంతులు వ్యాపించి ఉన్నాయి. ఇంకా యీ పాటలుకూడ వింటే తలెత్తి తిరిగే అస్కారమే లేకుండా పోతుంది." అంటాడు. పెద్దగా పాడవద్దని అడుగుతాడు. సర్దుకుపోవటమే పరమార్థంగా పెట్టుకొన్న సీత ఒప్పుకుంటుంది. ఒప్పుకోవటమే కాదు. తాను చేసింది తప్పని అంగీకరిస్తుంది. సుశీల తత్వం వేరు. వెంకట్రావు కోరికకు సమ్మతించకుండా ధిక్కరించి పాడుతుంది. వెంకట్రావుచేత చెంపపెట్టు తింటుంది. ఆ దెబ్బతో ఆమె ఆశాసౌధాలు కూలుతాయి. అభిలషించిన జీవితం విచ్ఛిన్నమై పోతుంది. ఇక వెంకట్రావు వద్ద ఆమె ఆశింపదగిన దేముంది ? "వెళుతున్నాను. అన్నీ అనుభవించి వెళుతున్నాను. ప్రతీక్షాఫలం పొందే వెళుతున్నాను. అవండి. అనుకోండి. మీలో మీరేమన్నా అవండి." అని భరతవాక్యం చెప్పి వెళ్ళుతుంది. జనార్దనరావు, రామాయమ్మలు ఆశ్చర్యచకితులౌతారు.

ఇది వాచ్యార్థం. నాటికలో చివరి దృశ్యంలో తప్ప ఆయా పాత్రలు వేరుగా ఎలాంటి కష్టసుఖాలు అనుభవించారో, ఎలాంటి స్థితి గతులను ఎదుర్కొన్నారో పాఠకులకు చక్షుగోచరం కావు. వారి వారి మాటలను బట్టి చాలచోట్ల అనుమాయమానాలు కొలది చోట్ల భావ్యమానాలు అవుతున్నాయి. అందువల్ల స్థూల దృష్టికి పాత్ర వైవిధ్యం గోచరించదు. అన్ని పాత్రలు ఆవేశపూరితంగా మాటాడుతాయి. ఈ మాటల ఆవేశంకూడ పాత్రల వైవిధ్యాన్ని కూడ కొంతవరకు కప్పి వేస్తున్నది. కాని కొంచెం నిశితంగా చూచే పాఠకుడు ఈ స్థితిని అధిగ మిస్తాడు.

"సంస్కారం! సంస్కారం! అందరూ యీ సంస్కారాన్నే ఆరాధిస్తున్నారు. అన్ని జ్ఞానాలు, అన్ని సంస్కృతులు ఈ సంస్కారం పేరుతోనే చెలామణి అవుతున్నాయి. అవస్థలూ, అనుభూతులూ తర్కించరు. వస్తూత్పత్తి పరికర ప్రమాణము. మానవ జీవన ప్రవృత్తి ప్రమాణము ఒకేరకంగా ఎంచేస్తున్నారు. ఈ శరీరానికి మనస్సుకూ ఈ లోకంలో శాంతిలేదు. ముమ్మాటికీ శాంతిలేదు, సంస్కారములేదు, సంస్కృతీ లేదు. నటన, అంతా ఒక నటన" అనే వెంకట్రావు.

"ఈ సంస్కారాలూ - ఈ నూతన ఉద్యమాలు మనకు జీవనాన్ని యిచ్చాయి. మనకివే కావాలి. ఈ సంస్కారాలలోను మోసంలేదు. ఈ ఉద్యమాలలోనూ మోసంలేదు. ఉన్న మోసమంతా మానవ హృదయాల లోనే ఉంది......అనే సుశీల.

"కష్టపడి ఈ మేడలన్నీ కట్టినది. మనమేకదా" అని తెరలో నుంచి వినిపించే పాట.

"ఆ పాట విన్నావ్రట్రా. ఈ మేడలన్నీ వాళ్లే కట్టారట!...... వీళ్ళకు తిక్కపట్టింది." అనే రామారావు.

"దరిద్రులు, వట్టి దరిద్రులు.........వీళ్ళకు సుకుమారత్వమే లేదు. సౌందర్యమంటే ముందే గిట్టదు. ఆకలి, కడుపుమంటలు. యివే వారి గొడవలు." అనే సుశీల. "నా జీవితాన్ని వదలుకోలేను. నేనూ మనిషినే. నాకూ అన్నీ కావాలని అనిపిస్తున్నాయి. ఎటుచూచినా కోరికలే. అన్నీ కోరికలే. అన్నీ అభిలాషలే." అనే సీత.

"కదనభూమి కేగుదాం కత్తిదూసి దూకుదాం." అని తెరలోనుంచి వినవచ్చేపాట.

"వినండి. ఆ పాట వినండి. ప్రమాదాన్ని ఎదిరించటానికి ప్రబోధం జరుగుతుందట. ఏమిటి ఈ ప్రబోధం ? ఎందు కీప్రబోధం ? ఎవళ్ళ సమస్యలు వాళ్ళకే పరిష్కారం కాక చస్తూఉంటే వీళ్ళ గొడవ లేమిటి ? ఏడ్చినట్లే ఉంది." అనే సుశీల

పాఠకుణ్ని వాచ్యంనుంచి పైమెట్టుకు తీసుకుపోవటం జరుగుతుంది. అసలు సంస్కరణ అంటే ఏమిటి ? దాని ప్రయోజన మేమిటి ? వానిలో తవుల్కొన్న జీవికలు ఎలా సతమత మవుతున్నాయి ? ఈ అంశాలన్నీ స్ఫురిస్తాయి. ఈ స్ఫురణంవల్లనే పాత్రల నెదుర్కొన్న క్లిష్ట స్థితిగతులు విస్పష్టంగా గోచరాలు ఎందుకు చిత్రితాలు కాలేదో అర్థం అవుతుంది. అలా సూచనప్రాయంగా విడివడటంలోని ప్రయోజనం భావనకు పొడ కడుతుంది. పొడకడుతూ వ్యజ్యమానర్థంపొదుకొంటుంది. దానితో పాత్రలు, వర్గాలు వర్గాలుగా భాసిస్తాయి. సంస్కరణచే సాక్షాత్తుగా గ్రసింపబడ్డవారు వారి ఆ స్తవర్గము ఆచరణకు దూరమందుండే సంస్కరణాభిలాషులు వేరువేరుగా గోచరిస్తారు.

మొదటి వర్గానికి చెందినవారే వేంకటరావు, సుశీల, సీత - రెండో వర్గానికి చెందినవారే రామాయమ్మ, జనార్దనరావు, మూడో వర్గానికి చెందినవాడు రామారావు. ఈనాటిక ఆవిష్కరిస్తున్న ప్రపంచ ఆవలంబనమంతా సుశీల వేంకటరావుల పెళ్లి దాని పర్యవసానము. సుశీల వేంకటరావును మనసారా ప్రేమించింది. ఆ ప్రేమకు మూలం ఆత్మస్వాతంత్ర్య సుఖాలు. ఈ రెంటికీ వెంకటరావు హామీ యిచ్చాడు. అతడు తన మొదటి భార్యచేతకూడ చెప్పించాడు. సుశీల నమ్మింది. నమ్మక చేసే దేమున్నది? అంతకన్నా మార్గంలేదు. వేంకటరావు స్వభావం వేరు. అతని ఈ వర్ణాంతర వివాహానికి కారణం ఆ సంస్కరణ మందలి అభిమానంకాదు. సంస్కరణలు స్వతః ఆచరణీయమన్న నైతిక విశ్వాసం అతనికి లేదు. తదాచరణలో అనందం పొందగల సంస్కారం కాని వివేకంకాని ఉదారతకాని స్థైర్యంకాని ఎక్కడా లేదు. సుశీల విద్యావతి. గాయకురాలు. కేవలం ఆమెవల్ల శారీరకసుఖం మాత్రమే అభిలషించాడు. అయితే అతని

కున్న చదువు సంధ్యలు ఈ నగ్న సత్యాన్ని గ్రహించనీవు. ఈ కొమాన్నే సంస్కరణ మనుకుంటాడు. అతని స్వార్థం ఈ సంకుచిత దృష్టిని ఘ్నునిత సీతచేత తమ యిరువురి కలయికను ఒప్పుకొన్నట్లు చెప్పిస్తవి. ఇంకా అచ్చికొలు మరికొన్ని బుచ్చికొలు చెప్పి అతను సుశీలను పెండ్లి చేసుకుంటాడు.

సంప్రదాయం కులగౌరవం కోరే తల్లి ఎదురు తిరుగుతుంది, సుశీలను అనరాని మాటలు అంటూ ఉంటుంది. వేంకట్రావు తల్లిని మందలిస్తాడు. ఈ మందలింపు రాను రాను సన్నగిలి పోతుంది. ఈమాత్రమైనా తల్లిని మందలించటానికి సాహసించాడంటే ఒక్కటే కారణం స్ఫురిస్తున్నది. తల్లి ఈ నాడు తనమీద ఆధారపడి బ్రతకవలసిందేతప్ప తన కొమె ఈనాడు చేయగలిగిన సహాయం ఏమీ లేదు. మామ జనార్దనరావు కేకలు వేస్తుంటే తల ఒంచుకుంటాడు. అంతేకాదు. సుశీలనుకూడ తల ఒగ్గమంటాడు. కారణంకూడ అప్పుడే స్పష్టమౌతుంది. జనార్దనరావు అతని చేదోడువాదోడుగా ఉంటున్నాడు. అలాంటి వాని సహాయం వేంకట్రావు పోగొట్టుకోలేడు.

ఇలాంటి క్లిష్టస్థితిలో సీత మళ్ళీవచ్చి కూర్చుంటుంది. "నాకు వేరే ఏమీ అవసరంలేదు. మీవద్ద ఉండనీయండి" అంటుంది. సంస్కారిగా ఉదార హృదయుడుగా కనిపించదలచుకొన్న వేంకట్రావు మళ్ళీ నోరెత్తటానికి అవకాశం లేకపోయింది. త్యాగము, సర్దుకుపోవడము పరమార్థాలుగ పెట్టుకొన్న సీత సాక్షాత్తుగ సుశీలతో పరిణయంలో ప్రేమ పంచుకోవలసి వచ్చేటప్పటికి చిక్కులే వస్తాయి. ఆ యిద్దరిమధ్య పోలు వద్దనుకొన్నా, ఈర్ష్యాస్పర్థలు తలసూపకమానవు. ఇదివరకే ప్రతికూలంగా ఉన్న సంఘానికి అవకాశాలు లభిస్తాయి. సంస్కరణ గ్రస్తుల చరిత్రలు లోకుల గుసగుసలకు హేతువులవుతాయి. తిరస్కారభావానికి తావిస్తాయి. వేంకట్రావు ఆశించింది. సంస్కారంకాదు. కేవలం శారీకరసుఖం. సంఘంలో గౌరవ ప్రతిష్ఠలు. శారీరక సుఖం యెప్పుడు దీర్ఘకాలికం కాదు. అది మొదట్లోనే తీరిపోయింది. ఇప్పుడు తన్ను సంఘం మన్నించి నెత్తిన పెట్టుకొంటేనే సుఖం. ఆ సుఖానికి సీతా సుశీలల కీచులాట భంగకరంగా ఉన్నది. అందువల్ల తన సుఖంకోసం తమతమ నిస్పృహాన్నైనా

వెల్లడించటానికి వీలులేదని అతడు సీతా సుశీలలను ఇద్దరినీ శాసిస్తాడు. ఆ శాసనంవల్ల ఏమి వ్యక్తం చేస్తున్నారో ఆలోచించుకొనే ఓపిక శాంతి కూడ వేంకట్రావుకు నశిస్తాయి. సీతకు సర్దుకొని బ్రతకటం తప్ప మరొకలక్ష్యం లేదు. అసలు ఎందుకు బ్రతకాలో కూడ ఆమె ఎప్పుడూ ఆలోచించింది కాదు. బ్రతకటం మాత్రం అవసరమని ఆమె నమ్మకం. నమ్మకమే కాదు అసలు బ్రతుకకుండా ఉండలేదు. అందువల్ల తన అసంతృప్తిని నిరాశను ఇక మరెన్నడూ వెల్లడించనని లెంపలు వేసుకొంటుంది. సుశీల తత్త్వవేరు. స్వాతంత్ర్యం తద్వారా లభించే సుఖం బ్రతుకుకు పరమార్థాలని ఆమె నమ్మిక. నిజంగా వాటికోసమే ఆమె బ్రతుకుతున్నది. ఇలాంటి స్థితిలో వేంకట్రావు శాసనాన్ని ఆమెఏలా పాటిస్తుంది? ఎదురు తిరిగింది. చంపపెట్టు తింటుంది. ఆమెలక్ష్యాలన్నీ ఒక్కసారి బదాబదలయిపోతాయి. అలాంటి లక్ష్యాలు పోయినతరువాత వేంకట్రావుతో ఉండవలసిన అవసరంలేదు. అందువల్ల వెళ్ళిపోతుంది.

సీత ప్రాత సంప్రదాయాలలో పెరిగింది. భర్త కనుగుణంగా నడుచుకోవటమే వాటి ఉపదేశం. ఆ ఉపదేశాన్నిబట్టి భర్త సుఖంకోసం ఆమె త్యాగం చేయటానికి ప్రయత్నిస్తుంది. కాని వాస్తవ స్థితిగతులు తానూ ఒకమనిషినే నని తనకూ కోర్కెలున్నాయని తెలుపుతాయి. తన వ్యక్తిత్వానికి కోర్కెలకూ మేరలేవో ఏమేరలు లేకపోతే జీవితం నిరర్థకమో ఆమెకు తెలియదు. తెలిసికోవాలని ప్రయత్నించదు. ఎంతవరకూ సర్దుకు పోవటం ఎలాగో ఓలాగున బ్రతకటం ఆమె పరమార్థం. అందువల్ల అన్నిటికీ లొంగిపోతుంది.

రామాయమ్మ జనార్దనరావులు ప్రాచీన సంప్రదాయపరులు. నిజంగా ఆ సంప్రదాయాన్ని గూర్చి తెలిసిందికూడ తక్కువేమో. నలుగురిలో గౌరవంగా బ్రతకటం వారి లక్ష్యం. వేంకట్రావు వారిదృష్టిలో పెడమార్గం పట్టాడు. నిజంగా వాళ్లు కోపించవలసింది, సక్రమ మార్గాన పెట్టవలసిందీ వేంకట్రావును. కాని వేంకట్రావుకు వాళ్ళకు ఉన్న సన్నిహిత బంధుత్వం వాస్తవాన్ని చూడనీదు. అతనిమీద ఉన్న అభిమానంకొందినీ తల్లీ మామ, సుశీలమీద విరుచుకుపడుతారు. వేంకట్రావు పెడత్రోవ పట్టటానికి ఆవిడే కారణ మంటారు,

రామారావు తత్త్వం వేరు. అతనిలో విచారశక్తి లేదు. నమ్మిన దాన్ని ఆదరించేశక్తి అంతకన్నా లేదు. ఏవో కొన్ని పనులు ఆచరణీయా లనుకొంటాడు. వాటిని ఆచరించే శక్తి కాని స్థైర్యంకాని లేదు. కాని ఎవరన్నా ఆచరిస్తే బుజా లెగరవేస్తాడు. వారికి నీరాజనం పడతాడు. తన కిష్టంలేని వాటినిగూర్చి అసలు ఆలోచించటానికికూడ ప్రయత్నించడు. అలాంటి విషయాలలో తగుల్కొన్న వారిని మనుష్యమాత్రుడుగాకూడ చూడడు.

ఇలాంటి వ్యక్తులు గోచరిస్తారు. వీరంతా అనుమాన ప్రపంచం లోనివారవటంవల్ల పాఠకుడు ఎవరితోను తాదాత్మ్యం పొందడు. అతనికి వ్యక్తిగతంగా ఉన్న సంస్కారాన్నిబట్టి సుశీలమీదనో లేక సీతమీదనో కొంచెం సానుభూతి చూపించవచ్చును. ఆ సానుభూతి బలాన్ని అనుస రించే అతనికి కలిగే హృదయ స్పందన ఆధారపడి ఉంటుంది.

అయితే చిత్రింపబడుతున్న వస్తువు తన నిత్యజీవితంలో గోచరిస్తు న్నది కాబట్టి దానినిగూర్చి ఆలోచించవలసిన ఆవశ్యకత ఉన్నది కాబట్టి సంస్కారణాధికము వ్యాజ్యమాన మవుతున్నది కాబట్టి పాఠకునకుపర్యుత్సు కత కలుగుతుంది. ఈ నాటికలో ఉన్న విశేషం అదే. అది కలగని పాఠ కునికి ఈ రచన అరణ్యరోదనమే అవుతుందనటంలో ఏ మాత్రం సందేహం లేదు.

తెనాలి,
18—9—55.

డాక్టరు, జి. వి. కృష్ణారావు.
డి. లిట్.

# ఒకమాట

మనం మానవజీవితాన్ని చూస్తున్నాం. మార్పులు జరుగుతున్నా యని అనుకుంటున్నాం. సనాతనమని, అధునాతనమని హద్దులు పెడు తున్నాం. పాతకొత్తల మేలు కలయికలోని జీవితాన్ని భావిస్తున్నాం. మన భావనకు అనుగుణ్యంగా జీవితవిధానాన్ని నిర్మించుకోవాలని ఉబ లాటపడుతున్నాం. ఏది నవీనానికి చిహ్నమో, ఏది సనాతనానికి మూలమో స్పష్టం చేసుకొన్నామా అన్నది ప్రశ్నార్థకంగానే ఉంది.

ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా జీవితాన్ని భావించుకొంటు న్నారు. అందరిజీవితాలకు అనుబంధం ఎడతెగనిదిగా ఉందని వాదించుకొంటున్నారు. ఈ వాదాలు జీవితవిధానాన్ని నిర్ణయించుకోవ డానికి ఎప్పటికప్పుడు ప్రతిబంధకాలను కల్పిస్తున్నాయి.

ఏది సనాతనమో, ఏది అధునాతనమో తేల్చిచెప్పడం సాధ్యమా, అసాధ్యమా అన్నది గ్రహించకుండా నిర్ణయాలు చేసివేస్తున్నారు. ఈ నిర్ణయాలు కాలగర్భంలో అనంతమై, అవిభాజ్యంగా కనిపిస్తున్నాయి. ప్రతిఒక్కరూ యోచన చేయగా చేయగా యదార్థం గోచరమౌతుంది. జీవితంలోని సనాతన, అధునాతన భావసమన్వయం ద్యోతకమౌతుంది.

మానవసంఘం అన్నమాటే విచిత్రంగా ఉంది. సంఘానికి, వ్యక్తికీ జీవనధర్మానికి ఉన్న సంబంధం విభాగించడం సాధ్యమా, అసాధ్యమా అన్నదే యోచనచేసి నిర్ణయించాలి. యోచన చేయువారెవరు అన్నదే పెద్దసమస్య. ఈ నాడు యోచన చేయువానికి, వినువానికి మధ్య విభ జన చేసి నిర్ణయించడం పూర్తిగా అసంభవమనిపిస్తుంది. ఒక్క ఈనాడే కాదు. సర్వకాలాలలోను యీ సమస్యను తేల్చి నిర్ణయించడం కష్టమే ననిపిస్తుంది.

ఈ నాడు యీ సంఘంలో అందరం అన్నీ చూస్తూనే ఉన్నాం. అన్నింటిని గురించి యోచన చేస్తూనే ఉన్నాం. ప్రతి సమస్యకు సమా ధానం పొందినామని గర్విస్తూనే ఉన్నాం. వ్యక్తి జీవితము, కుటుంబ జీవితము, సంఘజీవితము, పురోభివృద్ధి పొందుతున్నవని నమ్మేస్తున్నాం. ఇందులోని సాధ్యాసాధ్యాలనే గమనించడంలేదు. మనం అన్నింటినీ నిర్ణ యించినట్లు భావిస్తున్నా, మనకు తెలియని, మనము అనుకోలేని, మన భావనకు అందనే అందని మరెన్నెన్నో సంఘటనలు జరిగి పోతున్నాయి.

మనం వీటికి సమాధానాల్ని చెప్పుకోలేని స్థితిలో ఉండికూడ వాస్తవాన్ని, యాదార్థ్యాన్ని, సత్యాన్ని కృత్రిమ విభాగంచేసినట్లు భావించి యిదే విజ్ఞతకు, విద్యకు ప్రమాణమని చెప్పేస్తున్నాం. ఎంత విచిత్రం! మానవజీవిత విజ్ఞతావికాసానికి ఎంత అపహాస్యం !!

మనకు మనిషి రెండు విధాలుగా కనిపిస్తాడు. ఒకటి శారీరకం. రెండు మానసికం. ఈ రెండింటికి వ్యత్యాసం ఉంది. ఈ రెండూ రెండు తరహాలు. సామాన్యంగా యీనాడు శారీరకమే ప్రధానంగా భావించడం వల్ల మానసిక వైవిధ్యాన్ని చూడడంలో, చూచినదానిని గ్రహించడంలో, గ్రహించినదాన్ని రమణీయంగా చిత్రించి కళాప్రపూరితం చేసి చూపించడంలో, భావనా ప్రాబల్యం తక్కువగా కనిపిస్తుంది. ఇది యీనాటి సమస్య. ఈ సమస్యా పరిష్కారంకోసం యీ నాటిక రచించాను. శరీర సౌందర్యాన్ని మనం చూస్తున్నాం. మనోసౌందర్యాన్ని, సౌందర్యంలోని వైవిధ్యాన్ని చిత్రించి చూపాలని ప్రయత్నించాను. సనాతన జీవితానికి అధునాతన జీవితానికి తారతమ్యం తెలుసుకోవడం ఎంత అగాధమైన విషయమో తెలియడానికి యీ నాటికలోని పాత్రలు సహాయపడతాయని భావించాను. ఇందుకు ప్రయత్నమే యీ నాటికా రచన. ఈ ప్రయత్నం ఎంతవరకు నెరవేరిందో సహృదయులైన పాఠకు లందరూ నిర్ణయించుకొంటారని ఆశిస్తున్నాను.

ఈ నాటికపై అభిప్రాయాలను పాఠకులముందు ఉంచాను. ఈ అభిప్రాయాలు యీ నాటిక చదువరులకు సహకారం చేస్తాయని విశ్వసిస్తున్నాను. అడిగిన వెంటనే అభిప్రాయాలిచ్చిన ప్రముఖ సాహిత్యవేత్తలందరికీ నా హృదయపూర్వక వందనాలు. కోరినవెంటనే నాటికకు ముఖచిత్రాన్ని రచించి యిచ్చిన చిరంజీవి శ్రీ జి. వి. సుబ్బారావుకు నా ఆశీస్సులు.

శ్రీ రామకృష్ణ ప్రింటింగువర్క్సు వారు శ్రద్ధతో అచ్చువేసినందుకు వారికి నా అభివందనాలు.

విజయవాడ,
1-1-1956.

చదలవాడ పిచ్చయ్య.

# ప్రతీక్ష

ఒకటవరంగము



### వెంకట్రావు

సుశీ! ఏదీ ఒక్కసారి ఆపాటపాడు?

### సుశి

ఏపాటండీ?

### వెంకట్రావు

అదే, ఆపాటే !

### సుశి

అంటే ?

### వెంకట్రావు

మన మన అంతర్యాల లో అలంకరించుకున్నపాట, ఎన్నెన్నో అందాలుకూర్చుకున్నపాట. ఆపాటే.

సుశీ

అబ్బబ్బా! ఎంత నిగూఢంగా అంటారండీ. మిమ్మల్ని అర్థంచేసుకోవడానికి ఎంతో ఇబ్బంది పడుతున్నాను. వినండి. మీ మనసారా వినండి.

కనురెప్పపాటు మన కనుపాప కలసెనూ
మనమనమ్మనురాగ మమతస్పందించెనూ
ఎదలోని మనప్రీతి వ్యథను కలిగించెనూ
అదనన్న తుది ఆశ మదిని వలపించెనూ
ఆశాతరంగాల ఆనందమొలకెనూ
ఆహ్లాద పరితప్త ఆవేశమెడలెనూ
విడలేని వేదనా వెల్లువై కదలెనూ
పాయలై జరజరా పరచుకొనిపోయెనూ
కలవరము చెందనిది కదనమ్ము కాదురా
అంతరంగాలు మన మాంతర్యమరసెరా
మధుర మధురసమయిన మధుపమ్మిదేరా
ఆలింగనాపేక్ష ఆశ్రితార్ద్రితరా
కదిలింది కదిలింది కదిలినడచిందిరా
ఒరిగింది ఒడలిలో ఒరిసి ఒరిగిందిరా
గాఢగమనము తెలుపు కంపనమ్మిదెరా
అలసత్వమూనకా ఆదరముచూపరా
ఆదుకొని మనసార ఆనందమొందరా.

వెంకట్రావు

ఎంతహాయిగావుంది. ఎంత మధురంగావుంది. ఎంత మార్దవంగాఉంది. ఎంతరమణీయంగావుంది. సుశీ! ఎన్ని సార్లు పాడావు. ఎన్నిసార్లు విన్నాను. నీవు పాడటానికి నేను వినటానికీ ఆద్యంతాలు లేకుండా ఉండాలని ఉంది. ఏమంటావు?

సుశి

అవును! బావుంది. చాలాబావుంది. ఎందుకు బావుండదూ! తీరనికాంక్షలన్నీ తియ్యగానే ఉంటాయి.

వెంకట్రావు

అలా అనకు సుశీ! అలా ఆశించడంలోనే. అలా ఆ కాంక్షించడంలోనే నా మనస్సంతా దాగి ఉంది.

సుశి

మీ మనస్సు ఎప్పుడూ ఆశల్లోనూ, ఆకాంక్షల్లోనూ దాగి ఉంటుంది. అందువల్లే నాకందకుండా ఉంది. అలా నాకు అందకుండా అర్థంకాకుండా మీమనస్సును ఉంచకండి. నాకు జీవించాలనీ, ఆనందించాలనీ ఉంది. నన్ను నాకు కాకుండా చేయకండి. మీకు పుణ్యం ఉంటుంది.

వెంకట్రావు

నా జీవితమే నీకు అంకితంచేశాను. నిన్ను నా ప్రాణంగా చూచుకుంటున్నాను. మనమే ఒక లోకంగా భావిస్తున్నాను. మన అనుభవానికి హద్దుల్లేవు. మన జీవనానికి అంచుల్లేవు. ఈ భావనలో ఎంతో హాయివుంది. ఎంతో సుఖం ఉంది. ఎంతో ఆనందం ఉంది.

సుశీ

అదిగో అప్పుడే మీధోరణిలో మీరు మాట్లాడుతున్నారు. మీమాట ఒక్కటీ నాకు అర్థంకావటంలేదు. నన్నిలా వేధించకండి.

వెంకట్రావు

సుశీ! అర్థంకావడంలా. నామాటలు నీకు అర్థంకావడంలా. అలా అనకు సుశీ! అలాఅనకు. నీ ప్రతికోరికా చెల్లిస్తున్నాను. నాలో నిన్ను చూచుకుంటున్నాను. నీలో నన్ను దాచుకుంటున్నాను. నా ఆశా, నా ఆనందం, నా ఆహ్లాదం అన్నీ నీవే. నీవులేకుండా వున్నక్షణం ఒకయుగంగా ఉంటుంది. నిన్ను చూడకుండా ఉన్న క్షణం భరించ శక్యంకాకుండా వుంది. నేను అర్థంకావడంలా. నన్ను నీవింకా అర్థంచేసుకోవడంలా.

సుశి

మీరు అర్థంఅవుతున్నారు. మీ మాటలే నా కర్థంకావడంలేదు. నా అవస్థఅంతా అదే.

వెంకట్రావు

నేను అర్థమవుతున్నాను. నామాటలు అర్థంకావడం లేదు. ఎంత విచిత్రంగావుంది. సుశీ! ఎంత విచిత్రంగావుంది. ఎలా మాట్లాడమంటావు?

సుశి

నన్నే సర్దుకోమంటారు. ఎప్పుడూ నన్నేసర్దుకోమంటారు. ఎంతకాలం ఇలా సర్దుకుంటూ పోవడం. ఇలా సర్దుకుంటూపోవడంలోనే నా జీవితం తెల్లవారేలావుంది. సర్దుకోలేను. ఇహ సర్దుకోమని చెప్పేమాటలు నే నర్థంచేసుకోలేను. ఇహ నాకు అర్థమయేలా చెప్పండి. నేను అనుసరించ వీల యేలా చెప్పండి.

వెంకట్రావు

అబ్బబ్బా! ఎన్నిసార్లో చెప్పాను. ఎంతగానో బ్రతిమాలి చెప్పాను. ఎంతచెప్పీ ఏమి ప్రయోజనం. నీవు అర్థం చేసుకోవు. నామాటలు నీవు అర్థంచేసుకోవు. చూడు, లాచూడు.సుశీ! నీతను పంపించలేదూ? ఈపంపడం నీకోసం

కాదూ? నిన్ను సుఖపెట్టడానికి ఎన్నో విధాల చూస్తున్నాను. ఎన్నో విధాల ఆలోచిస్తున్నాను. ఈ చేస్తున్నదంతా నీకోసం కాదూ? ఇంకా నమ్మండం లేదూ, నన్నింకా నమ్మడం లేదూ? చెప్పు. నిజం చెప్పు. సుశీ నిజం చెప్పు.

సు శీ

నమ్ముతున్నాను. మిమ్మల్ని పూర్తిగా నమ్ముతున్నాను. నేనెంత నమ్మితే ఏం ప్రయోజనం? అంతా నాసుఖమేగా. అన్నీ నాకోసమేగా. పాపం మీరంతా ఇబ్బంది పడుతున్నారు. నావల్ల మీకన్నీ ఇబ్బందులేగా. ఏం చేస్తారు. చేసుకున్నారు. అనుభవిస్తున్నారు.

వెంకట్రావు

నేనలా అన్నానా సుశీ!

సు శీ

ఎబ్బెబ్బే! మీరనలేదు. నన్ను నేనే అనుకుంటున్నాను. నామనస్సు మంచిది కాదు. ఒక్కమాటా దాచుకోలేదు. అన్నీ చెప్పేస్తుంది. అసలు చిక్కంతా ఇక్కడే వుంది. మీరేం చేస్తారు. నాకు నేనే చేసుకుంటున్నాను. నన్ను నేనే ఇబ్బంది పెట్టుకుంటున్నాను.

వెంకట్రావు

ఎందుకలా అనుకుంటావు. నిన్ను నీవే అలా ఎందుకు నిందించుకుంటావు.

సుశీ

నన్ను నేను అనుకున్నాను. అదీ తప్పేనా.

వెంకట్రావు

అలా అనలేదు. నేనలా అనలేదు. మన సుఖంకోసరే చేశాను. మన ఆనందంకోసరే చేశాను. మనమన సుఖాలు వేరుగా భావించడంలేదు. ఇంతలో ఇలా నొచ్చుకుంటే ఎలా సుశీ? అనను. ఇహననను. ఒక్క మాటకూడా అనను. క్షమించు, ఈసారికి నన్ను క్షమించు.

సుశీ

అనేస్తారు. మీరు ముందుగా అనేస్తారు. ఆ తరువాత క్షమించమంటారు. ఈ అలవాటు మీ వాళ్ళందరికీ ఉంది. అవును! మీకేం? నేనుగా పరాయిదాన్ని. అనండి. అందరూ అనండి. అందరన్నవీ పడివుంటాను. ఏం చేస్తాను పడి వుండక. ఇదేగా జీవితం. నిత్యం ఇలానే జరుగుతూ ఉంటుంది. కానివ్వండి. ఓపిక వున్నంతవరకూ వినివుంటాను. మీ రందరన్నవీ పడివుంటాను.

## వెంకట్రావు

ఇంకా అర్థంచేసుకోవడంలా. నీవు నన్నింకా అర్థం చేసుకోవడంలా. తెలుసు. నీ ఆంతర్యం నాకు తెలుసు. నిన్ను మా వాళ్ళందరూ ఆదరించాలని వుంది. వాళ్ళ అభిప్రాయాలూ, వాళ్ళ ఆచారాలూ, వాళ్ళ సాంప్రదాయాలూ, వాళ్ళ ధర్మాలూ వేరుగా వున్నాయి. నీ అభిప్రాయాలూ, నీ ఆచారాలూ, నీ సాంప్రదాయాలూ, నీ ధర్మాలూ వేరుగా వున్నాయి. ఈ వ్యత్యాసం నా వల్ల వచ్చిందీ కాదు. ఇది నావల్ల తీరేదీ కాదు. ఇది మన ప్రేమకు ఆటంకమూ కాలేదు. అయినా నీ మనస్సు నొచ్చుకుంటూనే వుంది. ఈ విషయంలో నీవు చాలా సున్నితంగా వున్నావు. నీకు మావాళ్ళ ఆదరణ కావాలని వుంది. అది వాళ్లు గ్రహించడంలా. వాళ్ళు నిన్ను అనేస్తున్నారు. వాళ్ల పద్ధతుల్లో వాళ్ళు అనేస్తున్నారు. అది నిన్నూ, నీ మనస్సునూ క్రుంగదీస్తుంది. నీవు బాధపడుతున్నావు. నన్ను బాధపెడుతున్నావు. అందుకే వాళ్ళన్నవి వినకుండా వుండమన్నాను. అవి వినకుండానూ వుండలేవు. బాధపడకుండానూ బ్రతకలేవు. ఎలా సుశీ! ఇహనీబాధ తీరేదెలా సుశీ.

## సుశీ

మీ ఆచారాలు వేరు. మా ఆచారాలు వేరు. మీ ధర్మాలు వేరు. మా ధర్మాలు వేరు. మీకూ మాకూ

తేడా లున్నాయి. మనం ఇబ్బంది పడతాం. వినండి. నా మాట వినండని ఆనాడే ప్రాధేయపడి చెప్పాను. మీ రా నాడు నా మాట వినిపించుకోలేదు. పైగా అందరూ ఆద రిస్తారని చెప్పారు. నా కెంతో ముచ్చట చూపించారు. నన్నెంతో మురిపించారు. ఇవాళ తేడా లున్నాయంటున్నారు. ఇప్పటిలో యివి తీరవనీ అంటున్నారు. అయ్యయ్యో! అయి పోయింది. నా జీవన మంతా దుఃఖమయమయిపోయింది. ఉండలేను. ఇహ ఒక్క క్షణంకూడా వుండలేను. ఇచ్చట వుండలేను. ఇహ నుండలేను. ఈ నరకం అనుభవించలేను. ఈ యమయాతన భరించలేను. పోనివ్వండి. నన్ను పోనివ్వండి. మీరన్నా సుఖంగా వుండండి.

**రామాయమ్మ** (ప్రవేశం)

అయ్యయ్యో! ఇదేం కాలంరా నాయనా ఇదేం కాలంరా! దాన్ని పంపించావు. దీనితో కూర్చొని కులుకు తున్నావు. ఇదేమిట్రా నాయనా, ఇదేమిట్రా! నీ మనస్సిలా మారిపోయిం దేమిట్రా. ఈ కాపురానికి ఈ ముండ ఎచ్చట దాపురించిందిరా. రారా! నాయనా పోదాం రారా! ఎవరో పని వుందని వచ్చార్రా. వరండాలో కూర్చోమని వచ్చాను. పిలిచాను. నోరు నొచ్చేవరకూ పిలిచాను. ఎన్ని పిలిస్తే ఎలా వినిపిస్తాయి. మీ కెలా వినిపిస్తాయి. ఇదేమిటాఁ, అలా పట్టపగలే పడి చస్తున్నా రేమిటాఁ! ఒసేయి! సిగ్గులే దుటే- పరాయి వాడితో కులుకుతూ కూర్చోవటానికి.

అయ్యయ్యో! శ్రీహరి! శ్రీహరీ! ఈ పాడుబ్రతుకంత నాకు చూపిస్తున్నావుటా్రి తండ్రీ! నాకు చూపిస్తున్నావు వద్దురా తండ్రీ! వద్దు. ఈ పాపిష్టి బ్రతుకు నాకు చూపించ వద్దు. శ్రీహరీ! శ్రీహరీ!

## వెంకట్రావు

అలా అనకూడదమ్మా. అలా అనవద్దని ఎన్నిసార్ల చెప్పాను. ఈమెను నీ బిడ్డగా చూచుకోవాలి. అప్పుడె మన ఇల్లు శాంతంగా వుంటుంది. వినమ్మా! నా మాటవిను ఆమె తప్పేమీ లేదమ్మా. ఇందులో ఆమె తప్పేమీ లేదు అనకమ్మా! నిష్కారణంగా ఆమె ననకు.

## రామాయమ్మ

తండ్రీ! నీ మనస్సు విరిచిందిరా. నీ మనస్సు విరిచింది. ఇంకేముందిరా! ఇంకేముంది. పడిపోయావు. దాని మైకంలో పడిపోయావు. పోయింది. సంసారం భ్రష్టుపట్టి పోయింది. అయ్యో శ్రీహరీ! శ్రీహరీ! ఈ పాపం నేను చూడలేను. పోతోందిరా బాబూ, నా తలబ్రద్దలైపోతోంది. ఇహ భరించలేను. ఈ పాపం చూసి సహించలేను. చూడలేను. దీన్ని నా బిడ్డలా చూడలేను. బంగారంలాంటి సీతమ్మ సంసారం పాడుచెయ్యలేను. నా బొందిలో ప్రాణంవుండగా చెయ్యలేను. ఓసీ భడవాముండా! ఎందుకే అలా చూస్తు న్నావు. నీ కళ్ళు నీవు కాల్చుకు పోను. అలా నావంక చురచురా చూస్తావెందుకే? నీ మొహం మొద్దులైపోను.

### సుశీ

అబ్బబ్బా! విన్నాను. మీ మాటలన్నీ విన్నాను. మీ పోకిళ్ళన్నీ చూస్తున్నాను. అనరానిమాటలన్నీ అంటున్నారు. అత్తగారన్న మర్యాదేనా అంకిళ్ళుకట్టింది. ఇదిగో వినండి! ఇహావినండి. ఒక్క మాటన్నా ఓర్చేది లేదు. ఏం? అలానిశ్చేష్టులై చూస్తున్నారేం! అమ్మగారి ప్రతాపానికి ఆనందం పొందుతున్నారా. ఏం? అలా చూస్తున్నారు. పలుకండి. మిమ్మల్నే?

### రామాయమ్మ

ఓసి నీ నాలుక చీల్చుకుపోను. వాణ్ణికూడా అంటున్నావుటే! వాణ్ణికూడా అంటున్నావు. నోట్లో నాలుక లేని వాడు. ఎంతో గారాబంగా పెంచుకున్నాను. నా పంచ ప్రాణాలుగా ఎంచుకుంటున్నాను. ఒక్కమాట అనకుండా పోషించు కొచ్చాను. అంటావుటే భడవా, అంటావు! నిన్ను రచ్చకెక్కిస్తాను. నీ పరువు తీయిస్తాను. ఓసిభడవా! ఎంతకు తెగించావే! నీ తీగెలూ, నీ రాగాలూ, నీ తైతక్కలూ, నీ తళుకు బెళుకులూ, నీ సింగారాలూ, నీ నీటు గోటులూ, నా ముందటే నా ముందా! వాణ్ణిలాలించావు! బుజ్జగించావు! మురిపించావు! మోసగించావు! పలికిస్తున్నావు, నీవు పలికినట్లల్లా ప లి కి స్తు న్నా వు. ఆ డి స్తు న్నా వు! నీకు నచ్చినట్లల్లా ఆడిస్తున్నావు. కట్టించేదాన్ని – ఆనాడే నీ ఆట కట్టించేదాన్ని. ఆ సీతమ్మ వుత్తపిచ్చితల్లి. ఆనాడు నామాటే

వినిపించుకోలేదు. అదే వినివుంటే ఆనాడే నీ ఆట కట్టేది. నీవింతదూరంవచ్చే వీలేవుండేదికాదు. వినందే! నామాట పిసరంతైనా వినందే. అది వృత్త పిచ్చిబాగుల్ది. ఎవరు ఏమి చెప్పినా నమ్మేస్తుంది. అందులో వాడిమాటంటే అసలే అడుగుదాటదు. అదే దాని సంసారాన్నిలా ధర్మసంసారం చేసుకుంది. అందుకే నీవు కులికిపోతున్నావు. నీచదువూ నీవూ చట్టుబండలుకానూ! దాని సంసారం తీయటానికి వచ్చావు. మంగళసూత్రంకూడా కట్టించుకున్నావుట! మాయ మంగళ సూత్రం కట్టించుకున్నావు. చూస్తాను. నీసంగతి కట్టేవిధం చూస్తాను.

## వెంకట్రావు

అబ్బబ్బా ! వినలేను. ఈ మాటలు వినలేను. వెళ్ళవే నీ పుణ్యంవుంటుంది. వెళ్ళు. చంపేస్తున్నావు. నన్నుచంపేస్తు న్నావు. ఛీ! ఛీ! పోవే. నా కంటికి కనుపించకుండా పో. ఊ. వెళ్ళు.

## రామాయమ్మ

పోతున్నాన్రా నాయనా! పోతున్నాను. నిన్ను కన్నందుకు అన్నీ అనుభవిస్తున్నాను. వెడుతున్నాను. వెళ్ళక ఏం చేస్తాను. నాకూ కాలం దగ్గర పడుతున్నది. మీకు నా అడ్డంకూడా తొలగి పోతుంది. ఒక్కచింత ఉందిరా! ఆ చింత తీరకే ఇలావాగేస్తున్నాను. ఆ పిచ్చి సీతమ్మ తల్లి

విషయం తలచుకుంటే నా గుండె నీరయిపోతుంది. నాకడుపు చెరువయి పోతుంది. అదికూడా ఉన్నదన్న జ్ఞాపకం౦ఉంచుకో. నా కింకే కోరికాలేదు. ఆ సీతమ్మ తల్లీ నీవ్వూ సుఖంగా ఉంటే చూడాలనిఉంది. ఆ కాస్త ముచ్చటా తీర్చరా. వెడుతున్నాను. నా తండ్రీ వెడుతున్నాను.

## వెంకట్రావు

ఎందుకే ఇంకా అలా వాగుతున్నావు? అబ్బబ్బా! పోవే. త్వరగా వెళ్ళిపోవే.

## రామాయమ్మ

అంత ఆగ్రహంగా ఉందిట్రా. నేనేంచేశాను. కన్నతల్లిని కాబట్టి చెప్పాను. ఆ మాత్రంకూడా హక్కులేదూ? ఏం చేస్తానే! అనిపిస్తున్నావటే అని పిస్తున్నావు. నాబిడ్డ చేతే అని పిస్తున్నావు. అయ్యో శ్రీ హరీ! నా ఖర్మ ఇలా కాలింది. అడ్డమైనదీ వచ్చి నా యింట అధికారం చేస్తుంది. ఏంచేస్తాను? పోతున్నాను. తండ్రీపోతున్నాను. (వెళుతుంది)

## సుశీ

ఉస్! అబ్బబ్బా! బాధ! నన్ను ఒంటరిగా ఉండ నివ్వండి. అయ్యయ్యో ఈ బాధ భరించలేను. ఈ అవస్థ సహించలేను. మీకు నమస్కరిస్తున్నాను. మీరుకూడా వెళ్ళండి.

## వెంకటార్రావు

సుశీ! క్షమించు! ఈ సారికి నన్ను క్షమించు. నావల్ల అన్నీ నీకు బాధలే వస్తున్నాయి. నిన్ను సుఖంగా చూడాలన్న ఆశలే నిరాశలయ్యేలా ఉన్నాయి. ఎంత ప్రయత్నించినా నీ ఇబ్బంది తప్పించలేకుండా ఉన్నాను. నీకు బాధకలుగకుండా చూడలేక పోతున్నాను. ఏమో! ఇవన్నీ చూస్తూ ఉంటే నాకూ అయోమయంగానే ఉన్నది.ఇంట్లో వాళ్లూ బయటవాళ్లూ మనల్ని వింతగానే చూస్తున్నారు. మనచుట్టూ ఉన్నలోకమే మనకు కారాగృహమూ అని పిస్తూవుంది. మనం తప్పేమీచేయలేదు. అయినా వీళ్ళంతా ఎందుకో ఇలా చూస్తుంటారు. ఏమీ అర్థం కాకుండాఉంది. ఏదీ పాలుపోకుండాఉంది. మనఇష్టంవచ్చింది మనంచేశాం. మన కానందంగా ఉన్న మార్గం మనమనుసరించాం. ఎవరిదీ ఏం అపహరించలా. మన ఊసు వీళ్లెందుకు పట్టించుకుంటున్నారు? ఎందుకు నిందా పూర్వకంగా మాటలంటారు? నిత్యం ఎన్నిమార్పులు సంఘజీవనంలో జరగడంలా. అవన్నీ తమవిగా భావించు కుంటున్నారే. అయితే మన మార్పును విచిత్రంగా ఎందుకు చూస్తున్నారు. మనం ఎవ్వరినీ నిందించలేదే. ఎన్నడూ ఎవ్వరినీ దూషించలేదే! అయినా వీళ్ళ ప్రవర్తన అర్థంకాకుండా ఉంటుంది. ఈ అర్థంకాని అవ్యవస్థే జీవనధర్మమేమో! అబ్బబ్బా! ఎలాసుశీ! మనజీవనమే అయోమయంగాఉంది. మనకు ఇక సుఖంలేదా? శాంతి లేదా! ఏమో? ముందేమి జరిగేదీ తెలియకుండా వుంది,

సుశీ

తెలిసింది. అంతా తెలిసింది. అవస్థలన్నీ అనుభవించ టమే జీవన మని తెలిసింది. మీరు నన్ను నమ్మించారు. నాకు ఆశలు కల్పించారు. నన్నెంతో భ్రమపెట్టారు. నేన వన్నీ యదార్ధ మనుకున్నాను. నమ్మాను. మీ ఆదరసత్కా రాలన్నీ అందుకున్నాను. చాలు. బాబూ ఇక చాలు. ఈ యమయాతన చాలు. మళ్ళీ ఆశలు కల్పించకండి. గతాన్ని తిరుగ దోడకండి. ఆరుచిచూచాను. ఈ అనుభ వం ఇక చాలు. నన్ను నాకు విడవండి. నా శ్రమతో నన్ను జీవించనివ్వండి. మీకు పదివేల నమస్కారాలు. వెళ్ళండి. నా ఆత్మకు శాంతి నివ్వండి.

వెంకట్రావు

నీ వలా మాట్లాకు సుశీ! నీ కోసం అన్నీ వదలు కున్నాను. నీ మీద ఎన్నెన్నో ఆశలు పెట్టుకున్నాను. నీ గురించి స్నేహితుల కెన్నెనో చెప్పాను. నన్ను నిరాశా పరుణ్ణి చేయకు. చూడు. ఒక్కసారి నా మాట వినిచూడు! ఈ ఒక్కసారి నా మాటవినిచూడు. అప్పటికీ మావాళ్ళ ప్రవర్తన మారని పక్షంలో మనం దూరంగా ఉందాం. ఏం సుశీ! ఈ సారికి నా మాటనమ్మనా!

సుశీ

ఈ నమ్మకాలతోనే విసిగి పోతున్నాను. నాకు ఈ వాగ్దానాలు వద్దు. నాకు ఈ భ్రిమలూవద్దు. ఈ ఆశలూ వద్దు. నాకు ఒక్కటే కావాలి. అది మీ పరివర్తన.

వెంకట్రావు

నిన్ను బ్రతిమాలు కుంటున్నాను. ఈ ఒక్కసారీవిను. ఇహావినమని చెప్పను. ఇప్పటికి సర్దుకో.

సుశీ

ఈ సారికి సర్దుకుంటాను. మీరింతగా చెప్పారు కాబట్టి సర్దుకుంటాను. మీమీద ప్రేమతో అన్నీ సర్దుకుంటాను.

జనార్దనరావు (ప్రవేశించి)

ఒరేయి! వెంకట్రావు! నీకోసం చాలామంది వచ్చార్రా. అంతా వరండాలో కూర్చొని ఉన్నారు. రారా. త్వరగా పోదాంరారా.

వెంకట్రావు

వస్తున్నాను. ఇప్పుడే వస్తున్నాను. సుశీ వెళ్ళివస్తాను. ఇదిగో ఇప్పుడే వస్తాను.

సుశీ

అప్పుడే వెళుతున్నారా. ఒంటరిగా విడిచి వెళుతున్నారా. త్వరగా వస్తారుకదూ!

వెంకట్రావు

ఒక్కక్షణంలో వస్తాను.

జనార్దనరావు

ఒరేయి వెంకట్రావూ. ఇదేమిట్రా ఇదేమిటి! ఇలా అయిపోతున్నావేమిట్రా! నీవు నీ బాధ్యతే మరచి ప్రవర్తిస్తున్నావు. నానాటికీ విచక్షణకూడా లేకుండా పోతున్నది. ఎవరు వస్తున్నారో ఎవరు పోతున్నారో అన్న అభిప్రాయం లేకుండా ఉంది. ఇలాఅయితే అన్నీ చిక్కులే వస్తాయి. ముందు నీకన్నీ చిక్కులేవస్తాయి. ఉంటుందిలేరా ఆమె ఇక్కడే ఉంటుంది. ఇంతలో ఎక్కడికీ పోదులే.

సుశీ

ఇప్పటివరకూ అక్కయ్యగారి వంతు అయిపోయింది. ఇహ ఇది మీవంతే. అనండయ్యా, అనండి. మీ కాయాసం వచ్చేవరకూ అనండి. అనరానిమాటలూ అనండీ. అన్ని మాటలూ పడటానికే వచ్చాను. మీరు అంటూ ఉండటం నేను పడుతూఉండటం పరిపాటిగా జరుగుతుంది. ఇదిగో అలా చూస్తున్నారేం! మిమ్మల్నే. అంటున్నమాటలు వింటు

స్నారుగా. అవును. అసలు వారికే పట్టినప్పుడు పరాయివారు అనక ఏంచేస్తారు. అనిపించండి. మీ ఎదుటనే అన్నీ అని పించండి. ఏంచేస్తాను. మావాళ్లు వద్దంటున్నా మీతో సుఖ పడాలని వచ్చాను. అనుభవిస్తున్నాను. ఆ ఆనందం అనుభ విస్తున్నాను.

## వెంకట్రావు

క్షమించు. అతనన్నందుకు నన్ను క్షమించు. ఏదో మాటవరసకన్నాడు. మామ చాలా మంచివాడు. మరో అభిప్రాయం లేదు. మనకు అన్నివిధాలా చేదోడు వాదోడుగా ఉంటున్నాడు. అలాంటివాడు మనపై దురభిప్రాయంతో అంటాడా! అనడు. సుశీ, అనడు. ఆ మాటలు మరోవిధంగా భావించకు. నీకు బాధగా ఉన్నా నాకోసం క్షమించు. ఏదీ, అను. ఒక్కసారి క్షమించాను అను.

## జనార్దనరావు

అరేయి! నీవు మరీ చిన్నవాడవయి పోతున్నావు. నీ సంసార సంబంధమూ, నీ జీవనధర్మమూ, నీ ఉద్యోగ వ్యావ హారము, ఒక్కటీ పట్టకుండా ఉన్నావు. ఆపైన ఈ ప్రాధేయ పడటాలూ, ఈ క్షమాపణలూ ఏమిట్రా! ఇవన్నీ ఏమి టంటావు? ఇదంతా చదువుపిచ్చిలా ఉందిరా. ఈ చదువుపిచ్చే నిన్నింత చేసింది. ఏదో సంసారధర్మంలో అన్న ప్రతిమాటకూ అర్థం ఎలాఉంటుంది. ఇదంతా ఆ భావకవుల పిచ్చ. వాళ్ళ

సాంగత్యం చేశావు. అవే నీకూ అబ్బాయి. అంతేరా అంతే. అంతకన్నా మరేమీలేదు. సరేలే పద. పోదాంపద. చాలు చాల్లేరా. ఆమెకూ నీకూ కాబట్టి తగిపోయింది కాని, ఎవరన్నా వింటే నవ్విపోతారు.

సుశీ

అవును. అంతా నవ్విపోతారు. మా మాటలూ చేతలూ వింటే నవ్విపోక ఏంచేస్తారు. అవునవును. అదే అంతా అనుకుంటున్నారు. వెంకాయమ్మగారూ మీరూ గింజుకుంటూంటే ఎవ్వరూ ఏమీఅనుకోరు. మీరూ ఆమె అసభ్యంగా అరచుకుంటూంటే ఎవ్వరూ నవ్విపోరు. మా గదిలో మేము మాట్లాడుకుంటున్నా అసహ్యించుకుంటారు. ఆపైన నవ్వటంకూడా చేస్తారు. ఇదే లోకంతీరా? ఎవరెవరికి ఎలా తోస్తే అలానే అనుకుంటూ ఉంటారు. ఈ అనుకునే వాళ్ళకూ ఈ అనిపించుకునేవాళ్ళకూ శుద్ధీ శుచీ లేనంత వరకూ ఎవరికి తోచింది వారనుకుంటూ ఉంటారు. అనుకోనివ్వండి. ఈ అనుకునేది మమ్మల్ని గురించేగా. మధ్యలో మీకేం బాధవచ్చింది. అనుకోనివ్వండి. వాళ్ళనోరు నొచ్చే వరకూ అనుకోనివ్వండి.

వెంకట్రావు

మామనలా అనకు సుశీ. అలా మామ ననటం న్యాయంకాదు. నీకున్న బాధలో ప్రతిదీ వ్యతిరేకంగానే

తీసుకుంటున్నావు. మామ మనకెంతో అండగా ఉన్నాడు. అతనిమనస్సు విరిగేలా మాట్లాడకు. కొంచెం మర్యాద ఉంచు.

సుశీ

మర్యాద! మర్యాద! న్యాయం. ధర్మం. నా విషయంలో ఎవ్వరికీ ఇవి పట్టవు. అందరి విషయంలో ఇవన్నీ నేను పట్టించుకోవాలి. అందరన్నవీ పడిఉండాలి. అవును మీరూ మీరూ ఒకటేగా, మీరంతా బాగానే ఉంటారు. మధ్య నేనేగా చెడ్డదాన్ని. నా మూలంగానే మీకూ మీకూ చెడిపోతుంది. పాపం మీరెందుకు చేడిపోతారు. ఇప్పటికేదో చెడిపోయారు. ఇంతటితో సరిపెట్టుకోండి. మీరూ మీరూ బాగాఉండండి. నాదారి నేను చూచుకుంటాను.

వెంకట్రావు

అబ్బబ్బా! అలా అనవద్దనే అనేకసార్లు ప్రాధేయపడిచెప్పాను. నీ నా దారులు వేరుకావు. అలాఅనకుసుశీ, అలా అనకు, అలాఅని నా ప్రాణాలు తీయకు. నీకూ నాకూ దూరమవుతుందన్న మాట వినగానే నా శరీరం కంపించిపోతుంది. నా చలన శక్తులన్నీ ఒకేచోటికి కేంద్రీకరించ బడుతున్నాయా అనిపిస్తుంది. అయ్యయ్యో! ఈ బాధ భరించలేను. నీవు ఏమన్నా అను. ఎంతన్నా నిందించు. సహిస్తాను. కాని ఆ ఒక్కమాట అనవద్దు. మన మార్గాలు వేరన్నమాటే

అనవద్దు. అది వినే ఓపిక నాలో లేదు. నన్ను దయతో చూడు. నీకు కారుణ్యంలేదూ, ఎన్నిసార్లు చెప్పినా అలానే చేస్తావు. అబ్బబ్బా! గుండెనొప్పిగా ఉంది. మామా క్షమించవూ. ఆమె అన్నమాటలు నిన్ను బాధించి ఉంటాయి. నేను నిస్సహాయుణ్ణి. అటు ఆమెనూ అనలేను. ఇటునిన్నూ అనలేను. నన్ను నేనే నిందించుకుంటున్నాను. ఈ అవస్థలన్నీ అనుభవిస్తున్నాను. దిక్కుతోచకుండా ఉంది.

## జ నా ర్ధ న రా వు

ఎందుకురా అంత ఇదయిపోతున్నావు. నాకు ఎవరి మాటలవల్లా బాధఉండదు. ఇలాంటివన్నీ పట్టించుకోను. నిన్నూ నీ జీవితాన్నీ చూస్తుంటే నా మనస్సు కృంగిపోతున్నది. ఎన్నెన్నో విధాలనిన్ను కాపాడుకొస్తున్నాను. నీవు అర్థంచేసుకోకుండా ఉన్నావు. వినరా. ఇహ నన్నా నామాట విను. భ్రమింగరా. విచారం లోపలే దిగభ్రమింగు. ఇప్పటికే ఆలస్యమయింది. బయటవాళ్లు ఏమయినా అనుకుంటారు. పద.పోదాం పద. తల్లీ సుశీ! పొరపాటుగా అన్నాను క్షమించు.

## సు శీ

అనటము, క్షమించ మనటము ఈ ఇంటపరిపాటయిపోయింది. ఈ మాత్రానికే క్షమించమనటం ఎందుకు వెళ్ళండి. మీ మామగారితో వెళ్ళి పనిచూచుకురండి. ఏమండీ మిమ్మల్నే! పలుకరేం? అలాచూస్తున్నారేమిటి? అలాచూడ

కండి. నాకు కోపంలేదు. కష్టంలేదు. అన్నీమరచిపోతాను. మనం ఒక్కటిగానే ఉంటాం. మనం మనకు దూరంకాకుండా వుంటాం. వెళ్ళండి.

### వెంకట్రావు

వెళ్ళిరానా. నీవు సంతోషంగా వెళ్ళిరమ్మంటున్నావా. మనస్ఫూర్తిగా చెప్పు. ఒక్కసారి నవ్వుతూ చెప్పు.

### సుశీ

త్వరగా వెళ్ళిరండి, వస్తారుకదూ?

### వెంకట్రావు

ఆ! త్వరగా వస్తాను. మామా! పోదాం పద. నాకన్నివిధాలా సహాయం చేస్తున్నావు. నీకెంతో ఋణపడి ఉన్నాను. ఎప్పటికయినా నీ ఋణం తీర్చుకుంటాను. నాకు ఈ చిక్కులన్నీ ఒకనాడు తీరిపోతాయి. ఇవి తీరుతూనే నీ ఋణం తీర్చుకుంటాను.

(ఇద్దరూ వెళతారు.)

తెర

# ప్రతీక్ష

రెండోరంగం

(సుశి కూర్చుని ఉంటుంది. రామారావు, వెంకటారావు ప్రవేశిస్తారు.)

వెంకట్రావు

రామారావ్! వినవోయ్ విను. సుశి పాడుతుంది. అప్పటికీ ఇప్పటికీ ఎంత తేడా ఉందో విని చెప్పాలి. సుశీ ఒక పాట పాడు. అతను వినాలనే కుతూహలంతో వచ్చాడు.

సుశి

మరపురాని మన మధుర స్మృతికీ
మరువలేని మన మార్ద్రితగతికీ
మమతాస్పందన మననమ్మానా
నిలచి నిలుపగల నియతి ఇదేనా
తలపు వలపయే తపన ఇదేనా
మన మన మరసిన మార్గమిదేనా
ఎప్పటి కూర్మికి హితవా కాదా
తెలిసి తెలుపగల తీరే లేదా
మాటే మనసవు బాట ఇదేనా
సతమత మవని సంసారమిదేనా
అవునో కాదో అర్థము లేదో
ఆగి ఆగి మన మన మరయాలోయ్.

## రామారావు

చాలా బాఫుంది. వినడానికీ వివేకించుకోవడానికీ ఇంపుగా ఉంది. ఈ పాట ఎంతో బాఫుంది. సుశీలగారూ! చాలా కమ్మగా పాడారు. మీ కంఠంలో తియ్యదనం ఉంది. ఈపాట ఎంత హాయిగాఉందో చెప్పలేకుండా ఉన్నాను. అప్పటికన్నా మీ సాధనలో మార్పు ఉంది. అందువల్లే అంత మార్దవంగా పాడారు. ఈమధ్య కొన్ని పాటలు విన్నాను. ఈ హాయీ, ఈ ఆనందం పొందలా. వెంకట్రావూ! నీవు నిజంగా అదృష్టవంతుడవోయి. అంతే, అంతకన్న ఇంకేమీ చెప్పలేను.

## సుశీ

ఈ సాధన ఈ సంస్కారం అంతా వారిదే. నన్నెంతో ప్రోత్సాహ పరిచారు. నాకెంతో నేర్పుగా చెప్పించారు. వారి సహకారంవల్లే ఇలా అయ్యాను. నలుగురిలో నారాగం చూసేవారు ప్రాణప్రదంగా ఎంచుకుంటున్నారు. ఎంతో ఇదిగా నా మేలు కోరుతున్నారు. వారు అలా నామేలు కోరడంవల్లనే ఈమాత్రం ఇలా ధైర్యంగాఉండి పాడగలుగు తున్నాను. వారి ఆ ప్రోత్సాహమే లేకపోతే ఇప్పటికెప్పుడో నా జీవితం ఏ చీకటి ఎడారికో అంకితం అయిఉండేది. నా ఆశలూ, నా ఆకాంక్షలూ ఏ శూన్యాలలోనో కాపురముండి ఉండేవి. అలా కాకుండా కాపాడారు. నాకు జీవితం ఇచ్చారు. ఆశలు చిగురింపించారు. ఒక అభిరుచీ, ఒక ఆనందం అనుభ

విస్తున్నాను. రామారావుగారూ! మీరు నిజంగా అప్పుడూ ఇప్పుడూ ఒకే అభిప్రాయం కలిగిఉన్నారు. అందుకు మీకు అభివందనాలు! నా పాటలోని బాగోగులకన్నా నాపై సాను భూతే మిమ్మల్ని అలా అనిపించేలా చేసింది.

రా మా రా వు

కాదుకాదు! మీరు పొరబడుతున్నారు. నేను సాను భూతితో అనలేదు. నా హృదయంలో కలిగిందీ, నేను ఆనంద పడిందీ, సంతోషంపొందిందీ ఏదయితే ఉందో అదేచెప్పాను. మీరు ఎంతో బాగాపాడారు. అందులో ఏమాత్రం సందే హం లేదు. నాకు మీ పాట చక్కగా నచ్చింది. నాకు నచ్చి నంతవరకే భావాన్ని మీకు వెల్లడించాను. సంస్కారమన్నా సంస్కారభావాలన్నా ప్రాణప్రదంగా భావిస్తాను. అందులో ఎంతో ఆనందం ఉంది. అసలు సంఘ సంస్కారాలూ సమాజ అభ్యుదయాలూ లేకుండా విశ్వశ్రేయమూ లేదు. జీవితానందమూ రాదు. నిజంగా మీరూ వెంకట్రావుగారూ సంఘ సంస్కరణలో ఎంతో ముందంజవేశారు. ఇంత సాహ సం అందరూ చేయలేరు. మీ ఇద్దరి సాహసాన్ని గురించీ రంగాయమ్మా నేనూ ఎప్పుడూ మెచ్చుకుంటూ ఉంటాము. ఎంతగా మెచ్చుకుంటామో ఎలాచెప్పను. ఆభావం అంతా హృదయంలో ఉంది. ఎంతచెప్పాలన్నా విడిరాకుండా ఉంది. చెప్పలేను. ఆలోపల ఉన్న భావం అంతా విప్పిచెప్పలేను. ఒక్కమాటలో చెప్పాలంటే మాకు మీమీద ఎంతో ఇష్టం ఉంది. ఈమాటే అంత అర్థాన్ని ఇస్తుందని ఆశిస్తున్నాను.

## వెంకట్రావు

సంస్కారం! సంస్కారం. అందరూ ఈ సంస్కారాన్నే ఆరాధిస్తున్నారు. అన్నిజ్ఞానాలూ, అన్నిసంస్కృతులూ, ఈ సంస్కారం పేరుతోనే చెలామణీ అవుతున్నాయి. అవస్థలూ అనుభూతులూ తర్కించరు. ఇది మంచీ, ఇది చెడ్డా, ఇది సుఖం, ఇది దుఃఖం, ఇది సత్యం, ఇదసత్యం, ఇది శాస్త్రీయం, ఇదిశాస్త్రీయం, ఇదిధర్మం, ఇదిఅధర్మం. అన్న జ్ఞానమీమాంసవివరణ లేకుండాఉన్నది. ఇహ జీవనసౌందర్యాన్ని జీవితానందాన్ని ఎలా సమన్వయించుకోవడం లేదు. సమన్వయం లేదు. ఇందుకు నియతి నేర్పరితనం సజీవంగా ఉండనవసరం లేదు. అంతా యాంత్రికమే. వస్తూత్పత్తి పరికర ప్రమాణమూ, మానవ జీవనప్రవృత్తి ప్రమాణమూ, ఒకే రకంగా ఎంచేస్తున్నారు. ఈ శరీరానికీ మనస్సుకూ ఈ లోకంలో శాంతిలేదు. లేదు. ముమ్మాటికీ శాంతిలేదు. సంస్కారమూ లేదు. సంస్కృతీలేదు. నటన. అంతా ఒక నటన.

## సుశీ

అదిగో అప్పుడే మళ్ళీ మీరు మీ కవిత్వంలో పడిపోతున్నారు. అలా మీ గొడవలో పడిపోకండి. మనకే గొడవా వద్దు. ఆకవిత్వమూ దానితత్వమూ వద్దు. అదేమీ మనకు ఒరగబెట్టేది కాదు. ఈ సంస్కారాలూ, ఈ నూతన ఉద్యమాలూ మనకు జీవనాన్నిచ్చాయి. మనకవే కావాలి. ఈ సంస్కారాలలోనూ మోసంలేదు. ఈ ఉద్యమాల

లోనూ మోసం లేదు. ఉన్న మోసమంతా మానవ హృదయాలలోనే ఉంది. ఈ మానవ హృదయాలకన్నా ఒక్కొక్కప్పుడు ఆ యంత్రాలే ఎంతో కారుణ్యం కలవిగా కనుపిస్తాయి. అవి ఎన్నడూ ఎవ్వరినీ ఒక్కమాటన్నా అనవు. ఒక్క తిట్టుకూడా తిట్టవు. ఈ హృదయంగల మానవులందరూ అన్నివేళల్లోనూ అందరి జీవితాలనూ ఆడిపోసుకుంటూనే ఉంటారు. ఈ వీరిందరికన్నా ఆ యంత్రాలే ఎంతో సహనం కలవిగా కనుపిస్తాయి. ఈ తత్త్వశాస్త్రాలూ ఆత్మసంస్కారాలూ నింపుకొన్న దేశం ఈ యాంత్రిక సంపత్తుకే నేడు దాస్యం చేస్తున్నది. ఈ చచ్చుతత్త్వాలూ, ఈ జిజ్ఞాసలూ వద్దుబాబోయి వద్దు. ఇప్పటికే ఈ దేశం చచ్చీ చావకుండా ఉంది. ఇంకా ఈ జిజ్ఞాస పెరిగితే నాలాంటి అభాగినులందరూ ఆశాహతులౌతారు. ఈ ధర్మోపన్యాసాలూ వద్దు. ఈ తాత్త్వికచింతనలసలేవద్దు. ఈ భారతదేశపు సరిహద్దులలో ఇప్పుడు ఉండుకున్న మేరకే చాలు. కనీసం చచ్చీ చావని బ్రతుకన్నా ఉంది. ఇహ ఈమాత్రం కూడా ఎందుకు లేకుండా చేస్తారు. ఆలోచించకండి. మీరలా ఆలోచించకండి. అదిగో మీరెంతో ఇదిగా చూస్తున్నారు. ఏవేవో ఆలోచిస్తున్నారు. నాకేమో భయంగాఉంది. అదిగో నావంక అలా దీనంగా చూడకండి. జాలిగా చూడకండి. మీ ఆ చూపుల్లోనే అంతా ఉంది. అలా చూచి చూచి నన్ను కట్టివేస్తారు. నన్నూ నా మనస్సునూ హరించివేస్తారు. చూడకండి. అలా చూడకండి. అటుచూడండి. పాపం రామారావుగారు చాలా

విచారంగా వున్నారు. మీ మాటలు వారిని బాధించి ఉంటాయి. ఆయన చాలా మంచివారు. మనమంటే ఎంతో యిష్టంగా వుంటారు. అలాంటివారిని అంతకఠినంగా మాట్లాడితే బాధపడరూ. నామాట వినండి. అలా వారి ననడం పొరపాటని చెప్పేయండి.

## రా మా రా వు

ఎందుకలా దీర్ఘంగా ఆలోచిస్తున్నావు వెంకట్రావ్! నీ కళ్లూ, నీ ముఖవర్చస్సూ అదోవిధంగా వుంది. నీవెందుకు బాధపడుతుందీ బోధపడడంలా. నీలో నీవే అంతగా వ్యధపడడానికి కారణం కనిపించడంలా. అబ్బబ్బా! నిన్ను చూడలేకుండా వున్నాను. పాపం! ఆమెకూడా ఆందోళన పడుతోంది. అప్పుడప్పుడూ అందరకీ ఏదో అవస్థ వస్తూనే వుంటుంది. ఆ అవస్థ దాటితే అందరూ అందలమెక్కినట్లుగానే భావిస్తారు. కొంచెం స్థిమితంగా వుంటే అంతా అదే సర్దుకుపోతుంది. తమాయించుకోవాలి. పెద్దలంతా అంటారు. కూర్మి అంతా ఓర్మిలోనే వుంవట.

## వెం క ట్రా వు

నా కిష్టంలేని పాట పాడావు. సన్నిస్థితికి తెచ్చావు. అబ్బా! ఆపాట ఎంతబరువుగా వుంది. ఆ పాటలోని భారాన్ని భరించే శక్తి చాలకుండా వుంది. ఏదీ ఎప్పుడూపాడే ఆ పాట పాడు. ఇంతకుపూర్వం నీవు పాడిందికాదుసుమా. ఆ

మొదటిపాట. అది ఒకసారి వినిపిస్తే నాకు కలిగిన హృదయ భారమంతా దింపినట్లవుతుంది. ఏదీ ఒక్కసారి కంఠం విప్పి పాడు. తనివితీరా వింటాను.

రా మా రా వు

పాడుతల్లీ! అతను కోరిందే పాడి వినిపించు.

సు శీ

పాడుతున్నాను. మీరు కోరినప్రకారం పాడుతున్నాను. గొంతువిప్పి పాడుతున్నాను. హృదయం కరిగించి పాడుతున్నాను. మనస్సులయించి పాడుతున్నాను. మీ మన సారా వినండి.

( పాట ) కనురెప్పపాటు మన కనుపాప............

రా మా య మ్మ ( ప్ర వే శం )

పాటలు, పాటలు ఒకటేపాటలు. ఈ ఇల్లంతా ఒకటే పాటలు. అయిపోయింది. పాటలమయమయి పోయింది. ఇదేంకాలమర్రా ఇదేంకాలం! అయ్యో! శ్రీహరీ, శ్రీహరీ, నాకెందుకొచ్చిన పాపంరాఇది. నన్ను త్వరగా తీసుకుపోరా; తండ్రీ నన్ను త్వరాగా తీసుపో. కట్టిపెట్టవే, ఇహ ఈ గొడవలన్నీ కట్టిపెట్టు. పరాయివాళ్ళువింటే పరువుపోతుంది. ఒరేయి నాయనా! ఇలా అయిపోయావేమిరా తండ్రీ. ఇలాఅయిపోయావేం? అలావిచారంగా వున్నావేంరా? ఏం వచ్చిందిరాబాబూ?

ఏంముంచుకొచ్చింది. అయ్యో నీకీ అవస్థ లెందుకొచ్చాయి. ఒసేవ్! నీవు ఏక్షణంలో మా యింట కాలుపెట్టావో ఆనాడే నా బిడ్డ కన్ని అవస్థలూ సంభవించాయి. వాణ్ణి కొరగాని వాణ్ణిగా చేసేశావు. నీ కుయుక్తులూ నీవూ మండిపోను. శ్రీహరీ! శ్రీహరీ! మా సంసారానికన్నీ అగచాట్లువచ్చాయి. అన్నీ అగచాట్లేవచ్చాయి. అలాచూస్తావేమే? అలా చూస్తావేం! ఆ చూపులు ఆ వాలకం అంతా వెర్రెత్తిన దానిలానే వున్నాయి. ఒరేయి నాయనా, వెర్రెత్తిందిరా. దానికి వెర్రి కూడా ఎత్తిందిరా.

రా మా రా వు

వెంకట్రావు నిస్సారంగా వున్నాడు. అలా పెద్దగా మాట్లాడకండి.

రా మా య మ్మ

ఎవర్రా నాయనా, నీ వెవరయిందీ గుర్తించలేకుండా వున్నాను.

రా మా రా వు

నేను లక్ష్మీనారాయణరావుగారి పెద్దబ్బాయిని.

రా మా య మ్మ

నువ్వట్రా నువ్వా! ఎప్పుడు వచ్చావు? అంతా క్షేమంగా వున్నారా.

రా మా రా వు

నిన్ననే వచ్చాను. ఆయన క్షేమంగానే వున్నారు.

రా మా య మ్మ

అబ్బాయి నీరసంగా వున్నాడు. అవును నాయనా అవును. వాడికీమధ్య ఏదో వచ్చిపట్టింది. వాడు ఇలానే వుంటున్నాడు. వేళకు తిండీ తిప్పలూ లేకుండా తిరుగుతున్నాడు. ఏమోరా నాయనా ఏమయిపోతాడో, ఎప్పుడు తింటున్నాడో ఎప్పుడుపడుకుంటున్నాడో తెలుసుకోడానికి కూడా వీలులేకుండాఉంది. ఒకటే సంగీతం. ఎప్పుడూ ఒకటే సంగీతం. ఈ గొడవతో చచ్చిపోతున్నాము. చెవులు చిల్లులు పడిపోతున్నాయి. ఎందుకొచ్చిందో వీడికీగొడవ. ఇలా అయిపోయాడు. ఎంతగా పెంచుకున్నానో ఇప్పటి కిలావచ్చింది. వీడీ అవస్థలనుంచి ఎలా బయటపడతాడో బోధపడకండా ఉంది. కొంచెం నీవన్నా చెప్పు. నీవంటే వాడెంతో ఇష్టంగా ఉంటాడు. నీమాట తప్పడు. చెప్పిచూడు వస్తాను. నాయనా నేను వెళ్ళివస్తాను ( వెళ్ళును )

రా మా రా వు

వెంకట్రావ్, ఓరి వెంకట్రావు! ఇంత నీరస పడితే ఎలారా ?

## సుశీ

ఎందుకో ఆలోచిస్తున్నారు. అంతులేకుండా ఆలోచిస్తున్నారు. ఇలా ఆలోచించి ఆలోచించి ఏమయిపోతారో అర్థంకాకుండావుంది. ఎన్నిరకాలు ప్రయత్నించి చూచినా ఈ ఆలోచన మానేలాలేరు. అప్పుడప్పుడూ ఎందుకోసమో అబ్బబ్బ! ఒక్కటే ఆలోచన చేస్తుంటారు. ఇదిగో ఇలా చూడండి. మిమ్మల్ని కాదు పిలుస్తున్నది. రామారావుగారు అడిగిన దానికన్నా సమాధానం చెప్పండి.

## వెంకట్రావు

అదే ఆలోచిస్తున్నాను. ఎప్పుడో ఒకప్పుడు సమాధానం చెప్పటానికే ఆలోచిస్తున్నాను. నాకు సీరసంగా లేదు. నన్నుజూచి ఎవ్వరూ జాలిపడనవసరం లేదు. నేను తెలుసుకోకుండా ఉండటం లేదు. అన్నీ చూస్తున్నాను. వింటున్నాను. అందరన్నవీ వింటున్నాను. అన్నింటికీ సమాధానం చెప్పవలసే ఉంది. ఏ విషయానికి ఎలా సమాధానం చెప్పాలో పాలుపోకుండా ఉంది, అందరూ ఆంతరంగికులే. అంతే ఆప్తులే. ఒకళ్ళూ నా సమస్య నర్థంచేసుకోరు. ఒక్కరూ చక్కటి సలహా చెప్పరు. వాళ్ళ వాళ్ళ అభిప్రాయం వినిపిస్తారు. అవి పాటించమని అంటారు. అందులేని సాదకబాదకాలే గుర్తించరు. ఇదే లోకంతీరేమో.

## రామారావు

అదట్రా అదా! ఆమాత్రం దానికే సతమతమయి పోతున్నావు. మనం ఎందరి సమస్యలో చూచాం. వాటంతట అవే పరిష్కారమయి పోయాయి. జీవితంలో వచ్చే ప్రతి సమస్యకూ సమాధానం చెప్పుకుంటూ కూర్చుంటామటరా. అదే నీకు పట్టినపిచ్చ. అన్నీ అతిసున్నితంగా ఆలోచిస్తావు. అందరికీ అనుకూలంగా ఉండాలనుకుంటావు. అల్లా ఒక్కపని అవుతుందట్రా అదే నీవు తేల్చుకోవాలి. అప్పుడే జీవితంలో నీవొక నిశ్చయానికి వస్తావు. అంతేరా అంతే. అంతకన్నా స్నేహితులం, సున్నితమైన విషయాలలో ఏం చెప్పగలం.

## సుశీ

రామారావుగారు చక్కగా చెప్పారు. వినండి. ఎవరి సమస్యకు వారే సమాధానం చెప్పుకోవాలి. అంతేగాని పరాయివారి సలహాతో ఎంతకాలం సమస్యలు పరిష్కరించుకుంటూ కూర్చుంటాము. నాకదే అర్థంకావడంలేదు. మన మధ్య సమస్యకు పరాయివారి తీర్పెందుకండీ. నేనెంత చెప్పినా వచ్చేదేముంది. నన్ను చేతకాని దానిగా భావిస్తున్నారు. నా సలహామీకు రుచించనే రుచించదు. అందువల్లే నేనేమిచెప్పినా మీకు గౌరవంలేకుండా పోతున్నది. ఎప్పటికి మార్చుకుంటారో ఏమో! ఏమీపాలుపోకుండాఉంది.

## వెంకట్రావు

అందరూ అన్నీ చెప్పటం తేలికే. చిక్కంతా ఆచరణలోనే వస్తుంది. నేనూ ఎందరికో చెప్పాను. ఎన్నిరకాల ప్రోత్సాహమో చేశాను. ఆచరణలో అవస్థుందిరా బాబూ అన్నా వినిపించుకోలేదు. అసలవి నా చెవిని పట్టించుకోనే లేదు. పయిగా వాళ్ళను చేతకాని వాళ్ళుగా జమకట్టాను. నేనూ, నా తెలివీ ఎన్నిసమస్యలు వచ్చినా ఇట్టే పరిష్కరించుకోగలమనుకున్నాను. లేదు. అంతా చూస్తుంటే వాళ్లు చెప్పిందే నిజమూ అనిపిస్తుంది. అవునవును. ఎవరు ఏంచెప్పినా వినాలి. ఎన్నిచెప్పినా వినాలి. వాళ్ళూ వాళ్ళ అనుభవాలు చెపుతున్నారనే సానుభూతితో వినాలి. అదే చేయలేక పోయాను. అప్పుడు ఆ మాటలు మోటుగా ఉండేవి. అంతా ముడిసరుకులా అనిపించేది. ఇప్పుడిప్పుడే కొంచెం కొంచెం అర్థమవుతుంది. చదివిన గర్వమూ సంస్కృతీ ప్రభావమూ జీవితాన్ని సుఖవంతం చెయ్యలేవు. అంతవరకే నా కిప్పుడు అర్థమయింది. ఆపయివిషయం బోధపడకే నాలో నేను మథన పడుతున్నాను.

## రామారావు

ఎప్పుడూ సీతో వచ్చిన గొడవేయిది. ఆలోచన. ఆలోచన. జీవించేవాడికి అసలాలోచన లెందుకురా? జీవితం అనుభవించేదికాని, ఆలోచించేదిట్రా. ఆలోచించే వాడెవ్వడూ

జీవించలేడు. ముమ్మాటికీ జీవించలేడు. వాడు జీవించటానికి అన్నీ ఆటంకాలే కనుపిస్తాయి. చాలించరా చాలించు. నీ చదువూ నీ ఆలోచనా కొంతకాలంపాటు చాలించు. వాటి నలా ఉంచి కొంతకాలం జీవించు. ఆ తరువాత అన్నీ ఆలోచించుకోవచ్చు. ఈ లోకం ఎక్కడికీ పోదు. ఈ పుస్తకాలు ఎక్కడికీపోవు.

## సు శి

రామారావుగారు చెప్పింది వినండి. ముందు జీవించటానికి ప్రయత్నించడి. ఆపైన కొంతకాలం ఉన్నాక ఆలోచించండి. నా మనస్సు పట్టలేక అంటున్నాను. ఎవరు ఎన్ని చెప్పినా మీ మనసు తెంపుచేసుకుంటేగా. మీరొక నిర్ణయానికి వచ్చేవరకూ ఎవరు ఏదిచెప్పినా ప్రయోజనం లేదు. ఇదిగో ఇలాచూడండి. అబ్బబ్బా ! అలా ఆలోచించకండి. నాకు బెంగగాఉంది.

## వెంకట్రావు

సుశీ నాకూ జీవించాలనే ఉంది. నేను ఎంతసుఖంగా జీవించాలనుకుంటున్నానో అంత దుఃఖమయంగా జీవితం కనుపిస్తుంది. అయినా ఆనందం పొందుతున్నట్లు నటించలేను. నా ఆత్మను నేను వంచించుకోలేను. అదే నాకున్న చిక్కంతా. నువ్వూ, సీతా ఒక్కటిగా ఉంటారనుకున్నాను... అమ్మవల్ల కొన్ని ఇబ్బందులున్నా సర్దుకుపోవచ్చు ననుకున్నాను, అను

కోవటాలూ, భావించటాలూ అన్నీ అయిపోయాయి. ఇహ జీవించటమే మిగిలిఉంది. అదే చేతకావటంలేదు.

రా మా రా వు

వెయ్యేండ్లు తపస్సుచేసినా జీవించలేవు. నీవు ఏ మాత్రం సర్దుకోలేవు. అన్నీ పట్టించుకుంటావు. అవస్థపడతావు. ఇలాఅయితే ఎలా జీవిస్తావురా. జీవించలేవు. ఎబ్బెబ్బే! ఎన్నడూ నీవు జీవించలేవు. నీవు నీ ఆలోచన దూరంగా ఉంచనంతవరకూ జీవించలేవు. వినరా. నామాట విను. అలా కొంచెం షికారన్నా వెడదాం పద.

సు శీ

ఆఁ! ఆఁ! పదండి. కొంచెం అలా పోయివద్దాం పదండి. అప్పుడన్నా ఈ గొడవలు మరచిపోతారేమో.

వెం క ట్రా వు

రావాలని లేదురా. ఎక్కడికీ రావాలనిలేదు. ఎవరూ లేకుండా ఒంటరిగా ఉండాలని ఉంది.

రా మా రా వు

ఒంటరిగా ఉంటావు. చాలాబాగా అన్నావు. ఈ ఒంటరితనమే ఇంతవరకూ నిన్ను తెచ్చింది. ఇంకా ఒంటరితనమా. చాల్లేరా. ఇంక నీవాదాలు చాలించు. స్నేహధర్మంలో

అడుగు తున్నాను. వెడదాం రారా. అలాపోయి కొంచెం తిరిగి వద్దాం.

## సుశీ

నేను రావడం వారికి ఇష్టంలేకే ఇలా అంటున్నారు. ఏదేమిటో ఈ మధ్యనే ఇలా అయిపోయారు. నేను వస్తానంటేచాలు ఎందుకో మొహంచిట్లించుకు కూర్చుంటారు. అంతా ముంచుకుపోతున్నాలా కళ్ళు పెద్దవి చేస్తారు. అంత నేను రావడం ఇష్టంలేకపోతే వద్దని స్పష్టంగా చెప్పరాదూ. ఈ మాత్రం చెప్పటానికే ఈ అవస్థ పడడమెందుకూ. ఏదో లోపల పెట్టుకుంటారు. పైకి సంస్కారం వెల్లడయ్యేలా మాట్లాడేస్తారు. పైగా అంతావిచారణ చేస్తున్నానంటారు. కానీయండి. మీకు ఇష్టం లేకపోతే నేను రాను లెండి. మీరన్నా వెళ్ళండి. నేనేమీ అనుకోను లెండి. నాకోసం మీరేమీ బెంగపెట్టు కోకండి.

## వెంకట్రావు

నేను రానన్నంత మాత్రాన సిద్ధాంతాలూ, రాద్ధాంతాలూ మాట్లాడు తున్నారు. ఇదే మీతో వచ్చిన గొడవ. నా మనస్సు బాగాలేక రానన్నాను. అంతకన్నా మించిందేదీ లేదు. మీకు పోవాలని ఉందిగా. అయితే పదండి. నేనూ వస్తున్నాను. (తెరలోపాట)

అన్నా కూలీలేకము కావలెరా, అన్నా కార్మికు లేకము
కావలెరా

కూలిలందరు ఏకమైతే, కూటికీ తరుగేమిరా
కూలివాండ్లలోన బలమీ, కాలమందున నుండెరా
కూలివాండ్లమైన మనకు, కులములెందుకు తెలుపరా,
కూలివాండ్లమైన మనము, కలసియుందము సోదరా॥అన్నా॥

ఎండవానల కోర్చిమనమూ, కండలను కరిగించియూ
దండిగా రకరకములైన, ధాన్యములు పండిస్తిమీ
పండినా పంటంత సోమరి పోతులకు తెచ్చిస్తిమీ
తిండిలేకను చెట్టుగుట్టలు, తిరుగుతూ మనముంటిమీ॥

కష్టపడి ఈ మేడలన్నీ, కట్టినది మనమేకదా
కష్టపడి ఈ ఫ్యాక్టరీలు, కట్టివారల కిస్తిమీ
కష్టజీవులమైన మనకూ, గుడిసెలే గతియాయెరా
కష్టపడి పనిచేయుచున్నను, కడుపునిండుట లేదురా॥అన్నా॥

ధనము ధాన్యము తరుగనంతా, దేశమందున నుండెరా
తినుటకున్నప్పటికి దానికి, దూరమైపోయాముగా
ధనికులే ఈ సంపదంతయు, అనుభవించుటయేలరా
తినుటకన్నములేని మనకూ, దానిలో హక్కుందిరా
సమ్మెతో కూలీలరాజ్యము, స్థాపనము చేయొచ్చురా
॥అన్నా॥

### రామారావు

ఆ పాటవిన్నావూ! ఈమేడలన్నీ వాళ్ళేకట్టేరట. ఎంత అపహాస్యంగా ఉందిరా.

### సుశీ

అబ్బబ్బా! వీళ్ళ గొడవలతో చెవులు చిల్లులుపడి పోతున్నవి. దరిద్రులు. పట్టిదరిద్రులు. మొండిగా అరిచేస్తున్నారు. వీళ్ళకు సుకుమారత్వమేలేదు. సౌందర్యమంటే ముందే గిట్టదు, ఆకలీ, కడుపుమంటలూ ఇవే వీరిగొడవలు. ఛీ! ఛీ! వినడానికే వీళ్ళ అరుపులు అసహ్యంగా ఉంటున్నాయి.

### వెంకట్రావు

అనకండి. అలా అనకండి. వాళ్లు వాళ్ళ అవస్థ పడుతున్నారు. వాళ్ళను మనం విమర్శించడం ఎందుకు? వాళ్ళ గొడవల్లో వాళ్ళను పోనివ్వండి. మన గొడవల్లాంటివే వాళ్ళ గొడవలూను. మనం ఒకరకంగా అవస్థపడుతున్నాం. వాళ్ళు ఇంకోరకంగా అవస్థపడుతున్నారు. ఈ అవస్థలకు అంతూ పంతూలేదు. ఇందులో మీ తలలు దూర్చకండి. మీకు ఇవి అర్థమయేవీకావు. మీరు అర్థంచేసుకునే స్థితిలోనూ లేరు. పదండి. అలా కొంచెం బయటకు వెడదాం పదండి.

(ముగ్గురూ నడుస్తారు.)

తెర

# ప్రతీక్ష

మూడో రంగం

( సీతమ్మ కూర్చొని ఉంటుంది. రామాయమ్మ ప్రవేశిస్తుంది. )

రా మా య మ్మ

అయ్యో సీతమ్మతల్లి ! ఎంత పిచ్చితల్లివే. ఎవరన్నా చేతులారా సంసారం ఇలా చెడగొట్టుకుంటారా? నీకు తోచా తోచదు. నామాట వినావినవు. పండంటి సంసారం దాని చేతుల్లో విడిచిపోయావే మేసీతమ్మతల్లీ! నామాటవిను. మా అమ్మగా. నా కన్నతల్లిగా. ఇహనన్నా నామాట విను. నాయనా శ్రీహరీ- సీతమ్మ సంసారాన్ని నీవన్నా చక్కబరచు తండ్రీ. కాదుతండ్రీ ఈకాలపు పిల్లకాదు. అశుభం శుభంకూడా తెలియదు. ఎవరు ఏమిచెప్పినా వింటుంది. ఏమిచెప్పినా చేస్తుంది. ఉత్త అమాయకపుపిల్ల. నామాటే వినకుండాఉంది. నేనేం చేయనుతండ్రీ, నేనేం చేయను. ఏదయినా చెప్పానా వాడికే చెప్పేస్తుంది. వాణ్ణినమ్మే ఇంతవరకూ వచ్చింది. ఇహ నన్నా మార్చుతండ్రీ సీతమ్మ మనస్సు ఇహనన్నా మార్చు. వాణ్ణి చూస్తూనే మట్టిబొమ్మయిపోతుంది. వాడు చెప్పడం ఇది వినడం ఇదీవరస. నామాట అవుననీ అనదు. కాదనీ అనదు. అంతా వింటుంది. నేను చెప్పినదంతా వింటుంది. వాడు

చెప్పిందే చేస్తుంది. ఇహ ఈ సంసారం సాగదుతండ్రీ, ఈ సంసారం దీనికి కాకుండాపోతుంది. వినవే సీతమ్మతల్లీ, ఇహ నన్నా వినవే. మార్చుకోఅమ్మా మార్చుకో. నీ మనస్సు ఎలాగయినా మార్చుకో. పలుకవేతల్లీ ఇహానన్నా పలుకవే. నీ పలుకే బంగారమయి పోయిందేమే. అయ్యో అలాఅయి పోయావేమే! ఆదేమిటే అలాఅయిపోయావు. నీవూ నీ వాలకమూ అంతా మారిపోయావేతల్లీ, అంతా మారిపోయావు. దిగులుపడిపడీ పాలిపోయావే! తెల్లగా పాలిపోయావు. రక్తంచుక్కకూడా లేకుండాపోయిందే. అయ్యో! ఇంకెలానే నిన్ను చూస్తుంటే నా కడుపు తరుక్కు పోతుంది. అబ్బబ్బా నా కడుపు తరుక్కుపోతుంది.

## సీతమ్మ

అత్తయ్యా! ఎందుకో భయంగా ఉంది. అక్కడ ఉండలేక వచ్చేశాను. వారేమంటారో నని భయంగాఉంది. చాలా భయంగాఉంది. నేనేం చేయాలో తోచకుండావుంది అక్కడ ఉంటానికీ కష్టంగాఉంది. ఇక్కడ వుండటానికీ అవకాశం లేకుండా వుంది. నా బ్రతుకే అయోమయంగా వుంది. ఎటూ దారి కనుపించటంలేదు. ముందు చూస్తేనుయ్యి. వెనుకచూస్తేగొయ్యి. నా చేతులారా చేసుకున్నాను. యెవరి ననడానికీ వీలులేకుండావుంది. పాపం సుశీల తప్పిందులో ఏమీ లేదు. ఆ విడకు అన్నిఆశలూ నేనే కల్పించాను. నీ జీవితమే నా జీవితంగా భావించుకుంటానన్నాను. ఆవిణ్ణి నమ్మించాను.

నా జీవితం అబ్బబ్బా! నా జీవితం ఎంతో భయంకరంగా ఉంది. నా జీవితాన్ని వదలుకోలేను. నేనూ మనిషినే. నాకూ అన్నీ కావాలనిపిస్తున్నాయి. ఎటుచూచినాకోరికలే. అన్నీ అభిలాషలే. అన్నీ ఆకాంక్షలే. నాతల తిరిగిపోతోంది. అత్తయ్యా నా తలంతా తిరిగిపోతోంది. అబ్బబ్బా! తల దిమ్మెగావుంది. దిక్కుతోచకుండా ఉంది. అయ్యయ్యో!

## రామాయమ్మ

శ్రీహరీ! శ్రీహరీ! దయకలిగింది తండ్రీ నామీద దయకలిగింది. మా అమ్మ సీతమ్మలో మార్పువచ్చింది. మా సంసారం చక్కబడుతుంది. ఇహ ఫరవాలేదు. ఏడవకమ్మా ఏడవకు. నీకు మంచిరోజులొస్తున్నాయి. వినమ్మా, నామాట విను. నేను చెప్పినట్లు నడుచుకో. నీకు సుఖం కలుగుతుంది.

## సీతమ్మ

అత్తయ్యా! వింటాను. నీమాట వినకే ఇలా అయిపోయాను. నీమాట తప్పకుండా వింటాను.

## రామాయమ్మ

నామాట వింటావూ! నా ముద్దులతల్లీ! నామాట వింటావూ. శ్రీహరీ! శ్రీహరీ! వినుపించుతండ్రీ నామాట వినిపించు. ఈమాట జవదాటకుండా చూడుతండ్రీ. సీతమ్మ తల్లి ఈ మాటమీద నిలచేలా చూడు. నా బిడ్డ సంసారం

చక్కబడుతుంది. నాకోరిక ఫలిస్తుంది. వ్రతం చేయిస్తాను. ఈ కాస్త సంసారం చక్కబడుతూనే సత్యనారాయణవ్రతం చేయిస్తాను. తండ్రి నీఋణం తీర్చుకుంటాను.

## సీతమ్మ

వారు వస్తారేమో ! నాకు భయంగాఉంది. మనం ఒక్కచోటే ఉన్నాం. వారు అనుమానిస్తారు. అన్నీ చెప్పి నామతి విరిచారని మిమ్మల్ని నిందిస్తారు. మీకు నిందవస్తుంది. వెళ్ళత్తయ్యా వెళ్లు.

## రామాయమ్మ

ఓసి పిచ్చితల్లీ! నన్ను వాళ్ళేమనుకుంటే నాదేం పోతుందే. నాకు పోయేదేమీలేదు. వాళ్ళు వచ్చేవరకూ ఇక్కడేఉంటాను. వాళ్ళు నన్నేఅంటారు. అననీ. అన్నంత మాత్రాన ఏమిపోతుంది. మాటలనిపించుకుంటే పోయేదేమీ లేదు. మాటలు పట్టించుకుంటే జీవితం పోతుంది.

## సీతమ్మ

నాకు మరీ భయంగాఉంది. వారు వస్తారు. ఇద్దర్నీ చూస్తారు. కోపంవస్తుంది. వారి కంతులేని కోపంవస్తుంది. ఆ కోపాన్ని తలచుకుంటేనే నా గుండెలు కొట్టుకొంటున్నాయి. చూడలేను. ఆ కోపాన్ని చూచి భరించలేను. వెళ్ళత్తయ్యా వెళ్లు. నమస్కరిస్తాను వెళ్లు.

## రామాయమ్మ

ఆరునూరయినా వెళ్ళను. వాళ్లు వచ్చేపర్యంతం వెళ్ళను. వాళ్లురావాలి. నిన్నూ నన్నూ కలసి ఉండడం చూడాలి. వాళ్ళకుకోపం పెరగాలి. వాళ్ళ కోపమే వాళ్ళను దహిస్తుంది. ఇప్పుడు వాళ్ళకు కోపం ఎంత పెరిగితే అంతా నీకే మంచి నిస్తుంది. చూస్తూఉండు. జరిగేచిత్రం అంతా చూస్తూఉండు.

## సీతమ్మ

వస్తున్నట్లున్నారు. అదిగో అడుగుల చప్పుడు! వారు వస్తున్నారు. నాకుచాలా భయంగాఉంది. ఇహనన్నా వెళ్ళ త్తయ్యా!

## రామాయమ్మ

బుద్ధిలేదటే నీకుబుద్ధిలేదూ? పోతుంది. ఉన్నబుద్ధి కాస్తా పోతుంది. నీకు బుద్ధిలేకుండా పోయిందనే వాళ్ళన్నా నీకు బుద్ధిచెప్పి పంపించారు. వెంట మనిషినికూడా పంప నన్నారు. మంచిపని చేశారు. నా కడుపుమంట చల్లారింది. వాడు ఆడించి నట్లల్లా ఆడావే. ఇంకాబుద్ధికలగలా.. నా కేం నీవే అనుభవిస్తావు. వాళ్ళనికూడారానీ. వాళ్ళనీ నిన్నూ అడిగేస్తాను. నా సంసారం అంతాకలసి అల్లరిపెట్టేస్తున్నారు. పాపిష్టివాళ్ళయిపోయారు ఛీ! ఛీ! మీామొహాలుచూస్తే పాతకాలుకూడా చుట్టుకుంటాయి. (వెంకటావు,సుశీలవస్తారు.)

వెంకట్రావు

సీతా అప్పుడే వచ్చావా? కనీసం జాబుకూడా వ్రాయకుండా వచ్చావే!

సీతమ్మ

వచ్చాను. ఎందుకు వచ్చానో తెలియకుండావచ్చాను

రామాయమ్మ

ఆదిరా లేదు. వాళ్ళవాళ్లేపంపించారు. వాళ్లు వెంట మనిషినికూడా పంపించలేదు. మంచిశాస్తిచేశారు. వద్దే సీతమ్మ తల్లీఅంటే వినకుండానేపోయింది. జరగదగిందే జరిగింది. అందరూ అన్నిమాటలూ అన్నారుట. చివరకు సిగ్గు లేకుండాకూడా వచ్చావన్నారుట. ఏం చేస్తారు? అనక ఏం చేస్తారురా? పండంటి సంసారం పాడుచేసుకుంటూంటే ఎవళ్ళ వాళ్లు వాళ్ళ వాళ్ళని అనకుండా ఉంటారటా? అనుకుంటూరు. అన్నారని రోషపడితే ఏం వస్తుంది. పాపం సీతమ్మ తల్లిని పరాభవించికూడా పంపించారట. ఎవరన్నా ఇంత కఠినంగా ప్రవర్తిస్తారుటా? ఎవ్వరూప్రవర్తించరు. ఆపత్తులో ఆదుకోవాలి. కాని, ఇంతఅన్యాయం చేయటమా? అయ్యో! శ్రీహరీ! శ్రీహరీ! కాలంకాని కాలంవచ్చింది. అన్నీ విడ్డూరంగానే జరిగిపోతున్నాయి. అంతా విచిత్రంగానే ఉంటుంది. ఏమి కాలమో ఏమో! అన్నీ అపభ్రంశాలే చూస్తున్నాను. చూడలేను. ఇహ చూడలేను.

## సీతమ్మ

ఒంటరిగానే వచ్చాను. వాళ్లు అనేమాటలు విని పించుకోలేక వచ్చాను. ఉండలేను. వాళ్ళన్నీ సూటిపోటి మాటలంటున్నారు. అవి ఇహ వినలేను. ఒక్కక్షణంకూడా మీకుదూరంగా ఉండలేను. మీరేమన్నా అనండి. ఏదయినా చెయ్యండి. నే నిక్కడేవుంటాను. నన్నూ మీదగ్గరే ఉండ నియ్యండి. మీకు ధర్మంకాదు. నన్ను మీరు దూరంగా ఉండమనటంలో న్యాయం లేదు; వుండనియ్యండి. నన్ను మీ వద్దనే వుండనియ్యండి.

## వెంకట్రావు

నేర్పింది! అన్నీ నేర్పింది. చిలుక పలుకల్లా పలికిస్తుంది. విను. అమ్మ చెప్పిందే విను. ఆమాటలే మనకు ఈ అవస్థలు తెచ్చాయి. అది అసలే పూర్వకాలపు మనిషి. మన భావాలూ, మన ప్రవర్తనలూ, మన అలంకారాలూ అంటే సుతరామూ గిట్టనేగిట్టదు. అందులో నీవు చనువుయిచ్చావూ అది మన నెత్తినే కూర్చుంటుంది. మనకు అపచారం చేసి ఊరుకుంటుంది. సీతా! కొంచెంకూడా ఆలోచనలేని పని చేశావు. ఇప్పుడు రావడంలో మనకేమాత్రం శ్రేయస్సూ లేదు, పైపెచ్చు హానికూడా సంభవిస్తుందేమో. ఆలోచించుకో. నీవు చేసింది మంచో చెడో తెలుస్తుంది.

సుశీ

అక్కయ్యా! అక్కడందరూ క్షేమంగావున్నారా? అక్కడ వుండడం కష్టంగావుందా? మనం అందరం కలసే ఉందాము.

రామాయమ్మ

దానింటికది రావడంలో నీ సానుభూతి ఎందుకే? నీవు తీర్పరివికూడా అయ్యావూ. చాలుచాల్లే ఇహ కట్టిపెట్టు. ఇది దానిఇల్లే. ఇక్కడ మరెవ్వరూ వుండకూడదు. అంతా నీ మంచిమీదే ఉంచేలా మాట్లాడేస్తున్నావు. సిగ్గా ఎగ్గా. ఏదయినా అనేస్తావు. అసలు నీకు హక్కేలేదు. అన్నీ విడిచి ఆదరంచూపుతూ మాట్లాడుతున్నావు. చూస్తావేమిట్రా! అది అలా మాట్లాడుతూఉంటే చూస్తూవుంటావు. దానికీ నీకూ మతిపోయినట్లుగా ఉంది. సీతమ్మతల్లీ! నీకు ఎన్నిచెరలు వచ్చాయి. అయ్యో! శ్రీహరీ! శ్రీహరీ! ఎక్కడున్నావురా తండ్రీ! అగ్నిసాక్షిగా అంగీకరించిన భార్యకు అగచాట్లా. కట్టుకొచ్చినదానికి కాపురంపై పెత్తనమా. ఈ వివరీతా లేమిట్రా నాయనా! కాలం కానికాలంగా వుంది. ఇంకేం కలికాలమే వచ్చింది. తండ్రీ కలికాలం వచ్చింది. శ్రీహరీ! శ్రీహరీ! ఈ గొడవలు నాకువద్దు. ఈ గొడవలు నేను చూడ లేను. నేను వినలేను. నేను కనలేను. తండ్రీ నేను కనలేను. వెళ్ళుతున్నాను. మీరూ మీరూ ఏమన్నా అవండి. ఏమన్నా అనుకోండి. వినవుటే సీతమ్మతల్లీ నామాట వినవుటే. లేదు

నామీద నీకు రవంత విశ్వాసంలేదు. ఛీ! ఛీ! నాకెందుకు పట్టినగొడవలు. పోతున్నా న్నా పోతున్నాను. చావండి. మీలో మీరు తన్నుకుచావండి. తలపట్లు పట్టుకుచావండి. మీకదే రాసిపెట్టివుంది. నేను ,తప్పించలేను. మీ రాతలు నేను తప్పించలేను. శ్రీహరీ! శ్రీ హరీ! వెళుతున్నాను! వెళుతున్నాను. (వెళుతుంది)

## సీతమ్మ

చెల్లీ! అత్తయ్య ఎప్పుడూ అలానేఅంటుంది. ఆవిడకు ఎప్పుడూ ఈ వివాహమంటే ఇష్టంలేదు. అంతా నా ప్రయత్నం వల్లనే జరిగింది. అన్నీ నేనే చెప్పాను. అన్నీ నేనే చేశాను. తప్పంతా నాదే. నావల్లే నీకీ కష్టాలన్నీ వచ్చాయి. ఇందులో లోపమంతా నాది ఒక్కదానిదీకాదు. ప్రతిమాటా వారే అనిపించారు. వారు అనమన్న మాటల్లా అన్నాను. వారు చెప్పి చేయమన్న పనల్లా చేశాను. ఎందుకు చేశానో ఎలాచేశానో అవి ఇప్పుడు చెప్పమంటే చెప్పలేను. అప్పుడలా చేశాను. ఆ చేస్తున్నప్పుడు ముందూ వెనుకా ఆలోచించుకోలేదు. అత్తయ్య పోరుపెట్టి చెప్పినా వినిపించుకోలేదు. అప్పుడు వారు నావారే. వారికోసం చేయడంలో ఏదో ఆనందం ఉన్నట్లే తోచింది. అదంతా జరిగిపోయిన గాథ. అది తలచుకుంటే శరీరం కంపించిపోతుంది. దుఃఖం పొంగిపొంగి వస్తుంది. అవన్నీ నేనే నిజంగా చేయకలిగానా అని అనిపిస్తుంది. అంత భయంకరంగా ప్రవర్తించానా అని

తోస్తుంది. నామీాద నాకే కోపంవస్తుంది. నామీాద నాకే అసహ్యం వేస్తుంది. ఏంచెయ్యను చెల్లీ? ఏమీా పాలు పోకుండా వుంది.

సు శీ

ఏమండీ! అలా నిర్ఘాంతపోయి చూస్తున్నారేమిటి? అవన్నీ నిజమేనంటారా? అక్కయ్య చెప్పేవన్నీ యధార్థమని నమ్మమంటారా? పలుకరేం? మౌనంగావుంటే తీరిపోతుందనుకున్నారా? అలాపీల్లేదు. మీారిప్పుడే నిజంచెప్పాలి.

వెంకటా్రవు

అవును సుశీ! అవును.

సు శీ

అంటే?

వెంకట్రావు

ఆమె చెప్పింది అక్షరాలా నిజం.

సు శీ

మీారు స్వయంగా ఇదంతా చేయించారా? నా మనస్సును నేనే నమ్మలేకుండా ఉన్నాను. నిజంగా మీారుచేయించారా? మీా చేతులారా నాకీ అన్యాయం చేశారా? అయ్యయ్యో!

సీతమ్మ

అదంతా జరిగిపోయినచరిత్ర. ఎలాగో సర్దుకుని జీవించటానికి ప్రయత్నంచేదాం. నన్నుకూడా మీతో ఉండనీయండి. అంతకన్నా మీనుంచి నేనేమీ కోరడంలేదు. చెల్లీ! నన్ను నమ్ము. నా మాటపై ఈ మాత్రం విశ్వాసముంచు. నా జీవితంలో బాధ అంటే ఏమిటో బాగా తెలిసివచ్చింది. ఇంకెన్నడూ ఎవరికీ అపచారం చెయ్యలేను.

వెంకట్రావు

సుశీ! అనవలసినవన్నీ నన్నే అను. నేనే ఈ అన్యాయమంతా చేశాను. ఒక్క నీకేకాదు. సీతకూ, నీకూ, నాకూ అమ్మకూ అందరికీ నేనే అన్యాయంచేశాను. ఈ చేసిన అన్యాయానికి నన్నందరూ క్షమించండి.

సీతమ్మ

అలా అనకండి. మీరలా అనకండి. నా మతిపోయింది. నాకు తెలియకుండానే అన్నీ వాగేస్తున్నాను. మీకు అన్యాయం చేస్తున్నాను. చేతులారా అన్యాయం చేస్తున్నాను. ఆనాడే తిరస్కరిస్తే మీకూ నాకూ ఈ బాధలే వుండేవికావు. ఆ నాడూ నా స్వార్థమే నన్నిలా చేయించింది. ఈ నాడూ అదేస్వార్థం నన్నిలా చేయిస్తున్నది. నన్ను నమ్మండి. నమ్మకపోండి. నేను చాలా నిస్పృహాయస్థితిలో ఉన్నాను. మీరు దూరంకావటమే నాకీ వాగుడువచ్చింది.

ఆనాడు మీ దుఃఖం చూడలేక అవన్నీ చేశాను. నిజంగా నా కోసమే నేను చేసుకున్నాను. అందులో మీ లోపం ఏమీ లేదు. జరిగేదీ జరగబోయేదీ అనుభవించేదీ అత్తయ్య ఆంతర్యం విప్పిచెప్పినా మీమీద ప్రేమతో ఆనాడు చేశాను. మీకు దగ్గరగా ఉండి ఏమిచేస్తున్నా సంతృప్తిగా వుండేది. ఈనాడు నాకా సంతృప్తిలేదు. అదేనన్నిలా మాట్లాడిస్తున్నది. నా మనస్సె నా స్వాధీనంలో లేకుండావుంది. చెప్ప తగనివికూడా చెప్పేస్తున్నాను. అనతగనివన్నీ అనేస్తున్నాను. అబ్బబ్బా! ఈ నిస్సహాయస్థితిని భరించలేను. నా ప్రాణా లన్నీ గుంజుకు పోతున్నాయి.

సు శీ

అక్కయ్యా! అక్కయ్యా!! అక్కయ్యా!!!

(అని పడిపోతుంది.)

వెంకట్రావు

సీతా! సీతా!! సీతా!!!

( తెర )



# ప్రతీక్ష

## నాలుగో రంగం

( వెంకట్రావు కూర్చొని వుంటాడు. )

వెంకట్రావు

సుశీ ! సుశీ !! సుశీ !!!

( లోపలనుంచి )

ఆఁ ! వస్తున్నా.

వెంకట్రావు

త్వరగారా !

సుశి ( ప్రవేశం )

ఎందుకండీ అలాపిలుస్తారు ?

వెంకట్రావు

ఎందుకా? అదే అర్థంకాక తలబ్రద్దలై పోతున్నది. ఎందుకోపిలిచాను. ఈ పిలవడంలో అభిప్రాయమూ లేదు. అర్థం అంతకన్నా కనిపించడంలేదు.

సుశి

అయితే వెళ్ళమంటారా ?

### వెంకట్రావు

వెళ్ళకుసుశీ! వెళ్ళకు. ఉండు. కొంచెంవుండు. అలా ఎదురుగా కనిపిస్తూవుండు.

### సుశీ

అబ్బబ్బా! మీ గొడవ లేమీ నా కర్థంకావడంలేదు.

### వెంకట్రావు

అవి అర్థంఅయేవీకావు. అర్థానికి అందనూ అందవు. అంతరాంతరాలలో సంచారం చేస్తున్నాయి. ఆ అనుభూతులు విప్పిచెప్పడమూ కష్టమే. వివరించి వ్యక్తంచేయడమూ అసాధ్యమే. అందువల్ల నాలో నేను తపించిపోతున్నాను. ఈ తపనకు రూపంకట్టడమే సాధ్యంకాకుండా వుంది. ఎలాగయినా ఈ తపనకు రూపంకట్టాలి. ఈ తాపత్రయానికి చిత్రాంగి గీయాలి. అది రూపొందుతూనే నా అవస్థకు ఆనందంవస్తుంది. చూస్తున్నాను. అందుకే ఎదురుచూస్తున్నాను.

### సుశీ

అంత బాధపడుతూ ప్రయత్నించడం దేనికండీ? మీకూ నాకూ అర్థమయేవీ, మన సుఖానికీ సౌఖ్యానికీ ఆనందానికీ అందేవాటినే ప్రయత్నించరాదండీ?

### వెంకట్రావు

అదే ఆలోచిస్తున్నాను.

సుశీ

అదేదో త్వరగా చెప్పండి.

వెంకటారావు

సుశీ! నీకు దేనిమీదైనా ఇష్టంవుందీ?

సుశీ

ఆఁ! ఉంది.

వెంకట్రావు

అయితే చెప్పుచూదాం.

సుశీ

మీరూ నేనూ సుఖంగా వుండాలని వుంది.

వెంకట్రావు

అంటే?

సుశీ

అంటేనా! అది చెప్పలేను. అది చెప్పడానికి సాధ్యమయిందీకాదు. అది విప్పిచెప్పేశక్తీ నాకులేదు. అది ఒక అవస్థ. దానిని అనుభవంలో పొందవచ్చు. అది అనుభవించేదే గాని అంతా వ్యక్తంచెయ్యబడేది కాదు.

వెంకట్రావు

అలానా! అది అనుభవిస్తే అర్థమవుతుందా?

సుశీ

ఆఁ! ఆఁ! అది అనుభవిస్తే అర్థమవుతుంది.

వెంకట్రావు

జీవితంలో ఎన్నడయినాఅలాంటి స్థితి అనుభవించావా.

సుశీ

అనుభవించాను. ఆ అనుభవం ఇంకా జ్ఞాపకంవుంది.

వెంకట్రావు

అయితే చెప్పు?

సుశీ

అదే! ఆరోజే. ప్రథమంగా మిమ్మల్ని ఎంత చూచినా ఇంకా చూడాలన్న ఆకాంక్ష ప్రేరేపించిన ఆరోజే. అప్పటి ఆ అనుభం, ఆ ఆకాంక్ష, ఆ తపన అంతులేనంత వేగం కలిగి వుంది. ఇప్పటికీ ఆ అనుభవం గుర్తుకువస్తే నా అణువణువూ ప్రీతి స్పందిస్తుంది. అది ఎంతో హాయినిస్తుంది. ఇంతే. ఇంత కన్నా ఆ అనుభవం వ్యక్తంచేయలేను.

వెంకట్రావు

అలాంటి అనుభవమే నాకూ కలగడంలో తప్పేమైనా వుందా?

సుశీ

అలాంటి అనుభవం కలగడంలో తప్పేమీలేదు.

## వెంకట్రావు

సుశీ!సుశీ!! అయితే ఆ అనుభవమే, ఆ అవస్థే, ఆనాటి ఇష్టంలోని ఆ ఆనందమే మన ఈ సంబంధానికి కారణమయింది. ఇందులో ఎవరితప్పు ఎంత వుందీ అని ఎంచు కుంటూ కూర్చోవడం మంచిదికాదను కుంటాను. విలువలు కట్టడమూ వివేక మయిన పనికాదను కుంటాను.

## సుశీ

సరి! సరి! బాగా చెప్పారు. ఇందుకా మీరివన్నీ ప్రశ్నిస్తూ వచ్చారు. మంచిపనే చేశారు. మీరు ఏమయినా చేస్తారు. తప్పును తప్పించుకోవడానికి ఏదో ఒక కుయుక్తిని కల్పిస్తారు. మీరు చాలా విచిత్రంగా కనుపిస్తున్నారు. మీతో సామాన్యంగా జీవించలేము. అబ్బబ్బా ! మీ విధానమంతా విపరీతంగా వుంది.

## వెంకట్రావు

లేదు. సుశీ! లేదు. ఇందులో చేసిన మోసం లేదు. తప్పును తప్పించుకోవాలనే యోచనాలేదు. మనంమనకు అర్థంకావడానికీ మన అవస్థానుభూతుల ఆంతర్యం గ్రహించడానికీ ఈ ప్రయత్నం చేశాను. నిజమో అబద్ధమో నీవే ఆలోచించుకో.

## సుశీ

ఆలోచించు కున్నాను. అన్నీ ఆలోచించు కున్నాను. యోగ్యంకాని పనిచేశామనే బాధపడుతున్నాను. ఈబాధకు

పశ్చాత్తాపపడినా ఫలితంలేదు. పరమార్థం అంతకన్నా రానూ రాదు. అంతా నిష్ప్రయోజనమయి పోయింది. నా జీవితం నిష్ప్రయోజనమయి పోయింది.

## వెంకటావు

సుశీ! నీమీద నాకెంతో ఇష్టంవుంది. ఆ ఇష్టమే నన్నిలా చేయించింది. నన్ను నీవు అపార్థంచేసుకోవద్దు. నీవు నాకుజీవితం ఇచ్చావు. నీకోసం అన్నీ చేస్తాను. నీవు లేని జీవనం నాకు నిరర్థకం.

## సుశీ

మీరు అన్నీ నాకోసమే చేస్తారు. అలాఅనే నన్ను నమ్మిస్తూవచ్చారు. ఇంతవరకూ నిజమేనని నమ్మాను. ఇంకా అలాంటి ఆశలు కల్పించకండి. మీ కోసమే మీరు చేసుకోండి. నా కోసం నేను చేసుకుంటాను. ఇంతవరకూ మీరు కల్పించిన సౌకర్యాలు చాలు. అనుభవించిన సుఖాలూ, ఆనందాలూ చాలు.

## వెంకట్రావు

చెప్పకు; సుశీ చెప్పకు. చాలా ఓర్చుకున్నావు. మరి కొంచెం ఓర్చుకుంటే మన చిక్కులు తీరిపోతాయి. సీత నీ మాటే వింటుంది. నీ మాటలోనే ఉంటుంది.

**సుశీ**

అంతా నా మాటలోనే ఉంటారు. అందరూ నా ఆజ్ఞలే పాలిస్తారు. అందుకే అందరూ నన్నే అంటారు. ఇలా అనిపించుకోటానికేగా ఉంటుంది. అనిపించుకుంటాను. అందరిచేతా అనిపించుకుంటాను. అందరన్నవీ విని పడి వుంటాను. అప్పటికయినా మీ ఆత్మ సంతృప్తి పొందుతుందా?

**వెంకటార్రావు**

నన్నలా అనకు సుశీ! ఎన్నెన్నో ఆశలు పెట్టుకు బ్రతుకుతున్నాను. మన జీవితాన్ని గురించి ఎన్నెన్నో భావనలు కల్పించుకుంటున్నాను. మధురాతి మధురంగా మన జీవనాన్ని నిర్మించాలని తపించి పోతున్నాను. నా ఆశలన్నీ కూల్చేలా మాట్లాడకు. నా బ్రతుకే ఒక రోతగా అయిపోయేస్థితిని కల్పించకు. సుశీ! చచ్చీచావని బ్రతుకులో వున్నాను.

**సుశీ**

అబ్బబ్బా! మీతో వేగ లేకుండా వున్నాను. ఎప్పటి కప్పుడు నన్ను చిక్కుల్లో బంధించి వేస్తున్నారు. నాకన్ని వైపులా అన్నీ సమస్యలే. అక్కయ్య ఏడుస్తున్నది. అత్తయ్య అసహ్యంగా అనరాని మాటలూ అంటుంది. అయినవాళ్లూ, కానివాళ్లూ ఎత్తిపొడుస్తున్నారు. ఇదంతా నరకంలా అనిపిస్తుంది. ఇలాంటి జీవనం పగవారికి కూడా వద్దనిపిస్తుంది.

## వెంకట్రావు

సుశీ! జీవితంపైనే అసంతృప్తిని పెంచుకుంటున్నావు. అలా ఆలోచించకు. నామాటవిను. నిన్ను ప్రాధేయపడి అడుగుతున్నాను. నేను చాలా నిరాశాపరుణ్ణాయి ఉన్నాను. నన్ను నిరాశాపరుణ్ణిచేయకు. సుశీ! నన్ను నిరాశాపరుణ్ణి చేయకు.

## సుశీ

అబ్బబ్బా! నన్ను వేధించకండి. నా గుండె నొప్పిగా ఉంది. బాధ! అబ్బా! బాధ. (అని కూర్చుంటుంది.)

## వెంకట్రావు

సుశీ! సుశీ! సీతా! సీతా! (సీతమ్మవస్తుంది)

## సీతమ్మ

చెల్లీ! చెల్లీ! అలా ఆయాసపడుతున్నావెందుకమ్మా?

## సుశీ

దాహం! దాహం!

## వెంకట్రావు

సీతా! మంచినీరు, మంచినీరు, (సీతలోనికివెళుతుంది)

## సుశీ

అబ్బా దాహం!! దాహం! (సీతమ్మ మంచినీరు తెస్తుంది. వెంకట్రావు అందుకుంటాడు)

వెంకట్రావు

సుశీ! ఇదిగో ఈ మంచినీరు కొంచెం త్రాగు. (సుశి పెదవులకు గ్లాసు అందిస్తాడు. సుశి కొంచెం కొంచెంగా త్రాగుతుంది. నింపాదిగా కనురెప్పలు విడుతాయి)

సీతమ్మ

ఏంచెల్లీ బాధగా ఉందా?

సుశి

ఆ! ఆ! చాలా బాధగాఉంది. వారు నన్ను చంపేస్తున్నారు. వారిని దూరంగా వెళ్ళమను. నేను వారిని చూడలేను. వారిని దూరంగా పంపించు. అబ్బా! నా ప్రాణాలు పోతున్నాయి. పంపించు. వారిని త్వరగా పంపించు.

వెంకట్రావు

సుశీ! నిజంగా వెళ్ళనా?

సుశి

వెళ్ళండి! వెళ్ళండి. మీకూనాకూ ఇహ శాంతిలేదు. సుఖం అంతకన్నా లేదు. వెళ్ళండి. అయ్యయ్యో! వెళుతున్నారా? ఆగండి. ఆగండి. ఒక్కమాట విని వెళ్ళండి. నన్నేమికమ్మని వెళుతున్నారు.

సీతమ్మ

చెల్లీ! వారు వెళ్ళడంలేదు. వారు ఎక్కడికీ వెళ్ళడం లేదు. ఇక్కడే ఉంటారు. వారు నీతోనే ఉంటారు. నిన్ను విడిచి దూరంగా వెళ్ళనివ్వను.

### వెంకట్రావు

సుశీ! నువ్వు వెళ్ళమన్నా ఇప్పుడెక్కడికీ వెళ్ళను. సీతచెప్పింది విన్నావుగా, మనమెన్నడూ విడిపోము.

### సుశి

అక్కయ్యా! వారు వెళ్ళరుగా. నాకు దూరంగా వారు వెళ్ళరుగా. వారిని విడిచి దూరంగా ఉండలేనన్నావే? వారు నీకూ నాకూ ఎలాఅవుతారు! నీవు నిజంగా అనడంలేదు. నేను బాధపడుతున్నాననే అంటున్నావు. అవిగో! అవిగో! నీ కళ్ళల్లో నీళ్లు గిర్రున తిరుగుతున్నాయి. వారు నీకు కావాలనే నీహృదయం చెప్పేస్తుంది. అక్కయ్యా! నీ హృదయాన్ని నీవు దాచుకోవాలన్నా నీలోపల దుఃఖం పొంగివస్తూనే ఉంది. అది దాచుకోలేని బాధ. అంతులేని ఆవేదన. నీ ఆత్మను ఎందుకు వంచించుకుంటావు? నా ఆత్మని ఎందుకు వంచిస్తావు? తగదు. అక్కయ్యా తగదు. నీకూ నాకూ జీవితం కానుండా ఉంది. ఇహ ఈ బాధ భరించలేను. నిన్నూ నీ దుఃఖాన్నీ చూడలేను. నన్ను నేను వంచించుకోలేను.

### సీతమ్మ

మనలో మనమే సర్దుకోవాలి. చెల్లీ! మన దుఃఖాన్ని మనలోనే దాచుకోవాలి. మనకు మనమే ఓదార్పు చెప్పుకోవాలి. బాధవచ్చిందని బయటపడ్డామా బ్రతుకే భారమయి

పోతుంది. విను. నామాట విను. వారు నీవారే. నీతరువాతే నావారు. ఇది ముమ్మాటికీ నిజం.

వెంకటారావు

సుశీ! సీతా! పొండి. దూరంగా వెళ్ళిపొండి. మీరు నా ప్రాణాలు తీసేస్తున్నారు. అబ్బా! బాధ! అమ్మమ్మా! బాధ! వెళ్ళండి. దూరంగా వెళ్ళండి.

సీతమ్మ

వారికి కోపంగా ఉంది. మనం వెళ్ళిపోదాం.

సుశీ

అత్తయ్యను పిలువు అక్కయ్యా! ఆమె ఇక్కడ ఉంటుంది.

సీతమ్మ

అత్తయ్యా! అత్తయ్యా. (రామాయమ్మ వచ్చును)

రామాయమ్మ

ఎందుకే పిలిచారు? అలాచూస్తారేం? వాడలా ఉన్నాడేమే? పలుకండేతల్లీ పలుకండి. అయ్యో శ్రీహరీ! శ్రీహరీ! తండ్రీ నారాయణమూర్తీ! ఏదో ఆపత్తువచ్చింది. నీవేకాపాడాలి. నాతండ్రి ఉత్త పిచ్చిబాగులవాడు.

వెంకట్రావు

అబ్బబ్బా! ఏమిటే ఈ వెధవగోల. నాకు ఆపత్తూ లేదు. అవస్థాలేదు. అందరూ దూరంగా వెళ్ళండి. నా తల పగిలిపోతోంది. నన్ను ఒంటరిగా ఉండనివ్వండి. ఊఁ వెళ్లండి. (సీత, సుశి వెళతారు)

రామాయమ్మ

నన్నుండనీయరా నాయనా!

వెంకట్రావు

గోడవపెట్టకుండా వెళ్ళు. నన్ను విసిగించి చంపకు. తల్లీ వెళ్లు! నామాట వినిపించుకోని వెళ్లు. వెళ్ళమంటున్నా నుగా. అబ్బా! వెళ్ళిపోవే.

రామాయమ్మ

పోతున్నాన్రా నాయినా పోతున్నాను. శ్రీహరీ! శ్రీహరీ! ఈ అవస్థలన్నీ నాకు చూపించటానికే బ్రతికించావా తండ్రీ! చూడలేను. నేనీ అవస్థలుచూడలేను. వెళు తున్నాన్రా వెళుతున్నాను. (వెళుతుంది)

( తెర )

# ప్రతీక్ష

అయిదో రంగం

## సీతమ్మ (పాట)

అశ్రువులే నా కండదండలా
అనాదరమె నా ఆదరమా
నిరాశయే నా జీవనమా
నిస్పృహయే నాభావనమా
నిరీక్షణమె నావీక్షణమా
ప్రతీక్షయే నాబంధనమా
వినవా! కనవా? విముక్తి నివవా!!!

## సుశీ (వస్తుంది)

అక్కయ్యా! నీలో నీవు ఎంతో ఉడికి పోతున్నావు. ఎంతో తపించిపోతున్నావు. నీ అవస్థంతా అర్థమయింది. అబ్బబ్బా! ఈ పాట ఎంత విషాదకరంగా ఉంది. పాషాణాన్ని సహితం ద్రవీభూతం చేస్తుంది. ఈ పాటలోని ధ్వనులన్నీ నాలోనూ ప్రతిస్పందిస్తున్నాయి. నాహృదయ తంతువులలో లయిస్తున్నాయి. ఈ పాటిని విని సహించలేను.

## సీతమ్మ

నా గుండెనిబ్బరం చాలకుండా ఉంది. మనోధైర్యం కొరకే ఈపాట పాడుకున్నాను. నన్ను నేను సమాధాన

పరచుకోటానికి, ఒంటరి తనాన్ని మరచిపోవటానికి పాడు కుంటున్నాను. ఇంతలో నీవూ వచ్చి విన్నావు. నాగొంతు ఏది ధ్వనిస్తుందో నీ గొంతూ అదే ధ్వనిస్తుందా? అయితే ఇద్దరికీ స్థిమితం లేదు ఇద్దరికీ శాంతి లేదు. ఇలా అయిపోతామని ఇద్దరమూ ఎన్నడూ భావించ లేదు. చెల్లీ! నేను చాలా నిస్సహాయంగా ఉన్నాను. నా మనస్సు నా స్వాధీనంలో లేకుండా ఉంది. నీవన్నా కొంచెం గుండెనిబ్బరం చేసుకో. నన్ను ఓదార్చేవారెవరూ లేరు.

సుశీ

ఇంక ఈ గుండెకు నిబ్బరం లేదు. నిబ్బరం రాదు కూడా. అలాంటి అవకాశమే కనిపించడం లేదు. ఆ దశ జీవితంలో దాటిపోయింది. ఎవ్వరిననీ ప్రయోజనం లేదు. నన్ను నేనే నిందించు కుంటున్నాను. గతమంతా ఒకవింతగా భావిస్తున్నాను. సుఖంలేని ఒక చింతగా గ్రహిస్తున్నాను.

సీతమ్మ

అలా అనుకోవద్దు! చెల్లీ! అలాఅనుకోవద్దు. మనస్సు మరీ బెంగ పడిపోతుంది. నీవు బెంగపడ్డావా వారు నిర్జీవులై పోతారు. అప్పుడు మనజీవనం మరీ అయోమయమయిపోతుంది. చేతులారా మన జీవితాన్ని దుఃఖమయం చేసుకోవద్దు. విను. నా మాటవిను. ఎంత ఓర్చుకుంటే అంతఫలితం వస్తుంది.

## సుశీ (పాట)

కరుణించు వారెవరు కనుచూపులో లేరు
ఆదరణచూపవా ఆర్ద్రితాపవనమా
నా వలపు నా చెలిమి సక్రెటముంచెనూ
నావలో ననుగాచు నాథుడేవీడెనూ
అందాలు చందాలు ఆశలూ బాసలూ
అశ్రులై అసువుల అండగానిలచెనూ
కాచిరక్షించగల కాంక్షలేకూలెనూ
మధురమా మాస్మృతికి మరణమే వ్రాసెనో!

## సీతమ్మ

నీలోని నిస్పృహకుమూర్తి కట్టింది ఈపాట. అబ్బబ్బా నీ అసంతృప్తి నానాటికీ పెరిగిపోతోంది. నీ జీవితాన్ని విషాదాంతం చేసుకుంటున్నావు. అదిగదిగో! వస్తున్నట్లున్నారు. అడుగులచప్పుడు వినిపిస్తుంది. వారిటే వస్తున్నట్లున్నారు. ఈ పాటవినే ఉంటారు. నాకు భయంగాఉంది. వారు ఏదో చేసేస్తారు. ఈ కోపంలో వారు ఏదో చేస్తారు.

## సుశీ

వారు వినాలనేపాడాను. ఈ పాటవారేవినాలి. నేను లో లోపల ఎంత కుమిలిపోతున్నానో అర్థంకావాలి. ఎంత భరింపరానిభాధ అనుభవిస్తున్నానో వారికది అనుభంకావాలి. నాలాగా వారూ బాధపడాలి. వారుబాధ పడుతూంటేచూస్తాను

ఓర్పువహించండి స్వామి అంటాను. మనకు మంచిరోజులు వస్తాయి కొంచెం ఓపికపట్టండి అంటాను. వారికి ఎంతో సాను భూతి చూపించాలని ఉంది. ఈపాట ఇంకాపాడతాను. వారు విననన్నా పాడతాను. నా హృదయావేదన చల్లారేవరకూ పాడతాను. ఎంతో ఆశతో నిరీక్షించాను. నిరీక్షించాను. నా నిరీక్షకు నిస్పృహ యేతోడుగా ఉంది. నా ప్రతీక్షే నాకు మిగిలింది. నాకు ఇదే మిగిలింది. అందుకేపాడతాను. గొంతెత్తి పాడతాను. ఇదిగో పాడుతున్నాను. వినండి. వినండి.

(వెంకట్రావు వస్తాడు)

## వెంకట్రావు

సుశీ! సుశీ!! ఆగు. కొంచెం ఆగు. నిదానించు. కొంచెం నిదానించు. నే చెప్పేదికూడా చెవిని పట్టించుకో.

## సుశీ (ప్రవేశం)

విన్నాను. ఇప్పటివరకూ మీరు చెప్పినవన్నీ విన్నాను. ఇప్పటికే చెవులు చిల్లులుపడిపోయాయి. కళ్ళు కాయలు కాచిపోయాయి. మనస్సు మథనపడి పడీ ఉంది. ఇహ నన్ను బాధించకండి. నాకు మీ మాటలు వినిపించకండి. మీ పాదాలకు నమస్కరిస్తాను. నన్ను పాడుకోనివ్వండి. నా గుండెబరువు తీరేవరకూ పాడుకోనివ్వండి. ఇంతవరకూ మీ కోసం పాడాను. ఇప్పుడు నా కోసం పాడుకుంటాను. పాడుకో నివ్వండి. మీకు పుణ్యంఉంటుంది. పాడుకోనివ్వండి.

( తెరలోపాట )

కదనభూమి కేగుదాం కత్తిదూసి దూకుదాం
ఫాసిజాన్ని రూపుమాపి ప్రజలశక్తి చాటుదాం
జపాననగ నెంతరా దాని తాహ తెంతరా
అంత గలిసి తంతె మళ్ళి అంతుదొరకు నంటరా !

ప శి

వినండి ! ఆపాట వినండి !! ప్రమాదాన్ని ఎదిరించటానికి ప్రబోధం జరుగుతుందట. ఏమిటి ఈ ప్రబోధం? ఎందుకీ ప్రబోధం? ఎవళ్ళసమస్యలు వాళ్ళకే పరిష్కారం కాక చస్తోంటే వీళ్ళ గొడవలేమిటి? ఏడ్చినట్లేఉంది. వెధవ గొడవలు. అరచి అరచి ప్రాణాలు అల్లడితల్లడి చేస్తున్నారు.

వెంకట్రావు

వాళ్ళు వాళ్ళగొడవ చూచుకుంటున్నారు. వాళ్ళ అవస్థ వాళ్ళు పడుతున్నారు. ఏదో ఆపత్తు సంభవిస్తుందని ఎలుగెత్తి చాటుతున్నారు. విన్నవాళ్ళు వింటారు. విననివాళ్ళు పట్టించుకోడం మానివేస్తారు. నీకూ ఆ గొడవలకూ సంబంధమెందుకూ? నీ మనస్సులోని ఆదుర్దా నీకే అలాఅనిపిస్తుంది. నీవు మంచీచెడ్డా నిర్ణయించుకోలేని స్థితిలోఉన్నావు. నిన్ను చూస్తే జాలివేస్తుంది. దయ కలుగుతుంది. దాక్షిణ్యమేర్పడుతుంది. అయితే ప్రయోజనం? నీవు నా మాటవినిపించుకోని స్థితిలో ఉన్నావు. నన్ను లక్ష్యపెట్టవలసిన హద్దుదాటిపోతు

న్నావు. ఏంచేసేది? అంతా తెలిసిన సీతకూ నీకూ నాపై అనుమానం ప్రబలంగాఉంది. ఇదే మన సంసారానికి పట్టిన కర్మ. మన జీవితానికి పట్టినదుర్గతి. ఇది ఏవిధంగానూతప్పించ లేనేమోననిపిస్తుంది.

సీతమ్మ

అలా అనకండి.మీరలా అనకండి. మీమీద విశ్వాసం ఉంది. నేను పూర్తిగా నమ్ముతున్నాను. నన్నలా అనకండి. నన్నలా అంటే మీకు పాపంకూడా వస్తుంది.

సుశి

మళ్లీ ప్రారంభించారు. మీ గొడవలు మళ్లీ ప్రారంభించారు. మళ్లీ నన్ను మభ్యపెట్టటానికి ఎత్తులు వేస్తున్నారు. మీ గొడవలు వినిపించకండి. నన్ను పాడుకో నివ్వండి. నా కాపాట పాడుకోటంలో మహశ్శాంతి ఉంది. నా దీనావస్థను గమనించండి. నా మనసారా నన్ను పాడుకో నివ్వండి. ఏం? నన్ను పాడుకో నివ్వరూ?

సీతమ్మ

మన్న మన బంధనమ్ములికమానసమందున దాగియుండునో
కనికనరాని రీతిగల కాంక్షలు వ్యక్తము చేయుచుండునో
చనిచనరాని మార్గముల సాధన సాధ్యత లంది యుండునో
వినివినరాని దూషణ విశేషణముల్ వినిపించుచుండునో,

నాకు భయంగా ఉంది. నాకు చాలా భయంగా ఉంది. మనకు ఆపత్తు ఎంతో దాపులో ఉందా అనిపిస్తుంది. నేను చెప్పలేకుండా ఉన్నాను. నా మనస్సులో ఏదో ఆందోళనగా ఉంది. దిగులు దిగులుగా ఉంది. ఏమీ తోచడం లేదు. తలలో తిక్క-తిక్క-గా ఉంది. అబ్బా! బాధ.

వెంకట్రావు

మీరిద్దరూ నన్ను చంపేస్తున్నారు. మీకు నాపరువూ మర్యాదా పట్టలా. ఇప్పటికే నన్నందరూ అవహేళన చేస్తున్నారు. అన్ని రకాలుగా ఎత్తిపొడుస్తున్నారు. నా కున్న గౌరవం పోయింది. మరియాద పోయింది. నన్నందరూ చులకనగా చూస్తున్నారు. సీతా! సుశీ! ఇంకా మీకు తెలియడంలా. ఇప్పటికే అనేక వదంతులు వ్యాపించి ఉన్నాయి. అంతా మన జీవితాన్ని గురించే గుసగుస లాడుకుంటున్నారు. ఇంకా ఈ పాటలు కూడా వింటే తలెత్తి తిరిగే ఆస్కారమే లేకుండా పోతుంది. అది చెప్పడానికే వచ్చాను. వింటారనే ఆశతో వచ్చాను. నామాట మన్నిస్తారనే విశ్వాసంతో వచ్చాను. అడుగుతున్నాను. మిమ్మల్ని ప్రాధేయపడి అడుగుతున్నాను. పెద్దగా పాడనని వాగ్దానం చేయమని అడుగుతున్నాను. ఏమంటారు?

సీతమ్మ

పాడను ముమ్మాటికీ పాడను. ఒట్టుపెట్టుకుంటున్నాను. నామాట నమ్మండి. పొరపడి పాడాను. తెలియక తప్పు చేశాను, క్షమించండి.

సుశీ

నేను చేయలేను. ఇప్పుడు వాగ్దానం చేయలేను. మీ ఎదుట ఒకరకంగా చాటుగా ఒకరకంగా ప్రవర్తించలేను. నాకు ఎంతో బాధగా ఉంది. జీవితమంతా బరువుగా ఉంది. నే నిపుడు పాడుకోవాలి. నా కా పాటలో ఏదో ఆనందం ఉందనిపిస్తుంది. నన్ను పాడుకోనివ్వండి. మీ మర్యాదా గౌరవమూ మట్టికలపాలనుకోవడం లేదు. నేను చాలా నిస్సహాయస్థితిలో వున్నాను. పాట పాడడంవల్లే మీ పరువూ మర్యాదా పోతాయనుకోకండి. పాడితే మీ కెన్నడూ అభ్యంతరం చెప్పలా. ఇప్పటివరకూ మీ తనివితీరా పాడించుకుంటూ వచ్చారు. ఈరోజున నా కోసం పాడు కుంటానంటే వీలుపడదంటున్నారు. ఇది మీకు న్యాయం కాదు. ఇప్పుడు నాలో నే నేడ్చుకుంటున్నాను. మీరు నన్నింక ఒత్తిడిపెట్టి ఏడ్పించకండి.

సీతమ్మ

చెల్లీ! వారు చెప్పేది వినిపించుకో. వారు ఎందుకు వద్దంటున్నారో ఆగి ఆలోచించుకోటంకూడా మంచిదే. నిన్ను పాడుకోవద్దని నేను అనడంలేదు. కాని ఆలోచించడం కూడా మంచిదని అంటున్నాను.

సుశీ

నిన్ను నేను సలహా అడగడంలేదు. నీవీ విషయాలు పట్టించుకోకుండా ఉండడంమంచిది. వారిని అడుగుతున్నాను.

వారే సమాధానం చెప్పుకుంటారు. నీకు వినడానికి ఇష్టంగా వుంటే వుండు. లేనిపక్షంలో పట్టించుకోకుండా వుండటం మంచిది.

సీతమ్మ

చెల్లీ! నా కెందుకు? ఇహ పట్టించుకోను. వింటూ ఉంటాను.

వెంకట్రావు

సుశీ! నీవు నన్ను అర్థంచేసుకోవటంలేదు. లోగడవన్నీ తలుచుకుని తపించిపోతున్నావు. నీ తపనలో నీకేమీ పట్టకుండా వున్నాయి. ఆ పాట పాడటం మంచిదికాదు. మనకే మాత్రం శ్రేయస్సూ లేదు. ఆలోచించుకో! ఎందుకు చెప్పానో గ్రహించు.

సుశీ

అబ్బబ్బా! ఎన్నిసార్లు నా నోట ఆమాట చెప్పిస్తారు. నా మనస్ఫూర్తిగా నన్ను పాడుకోనివ్వండి. మరి ఎన్నడూ ఆపాట పాడను.

వెంకట్రావు

పెంకిపట్టు పడుతున్నావు. అబ్బబ్బా! చాలా మొరటుగా ప్రవర్తిస్తున్నావు. నిశ్చయానికిరా. కడసారి నీవొక నిశ్చయానికి రా.

సుశీ

తుది నిశ్చయం చేసుకున్నాను. ఆ పాట పాడాలనే నిశ్చయం చేసుకున్నాను.

వెంకట్రావు

అయితే నా నిశ్చయంకూడా విను. ఆ పాటలోని ఒక్క వాక్యంకూడా పాడనివ్వను.

సుశీ

నేను ఆపాటే పాడుకుంటాను.

వెంకట్రావు

పాడితే ప్రాణం తీసేస్తాను.

సుశీ

పాట పాడుకుంటే ప్రాణం తీసేస్తారు. పాపం ప్రేమించారు. నన్నెంతో ప్రేమించారు. లాలించారు. నన్నెన్నో విధాల లాలించారు. ముద్దూ ముచ్చటా అన్నీ తీరుస్తామని బులిపించారు. నిరీక్షించాను. ఇప్పటివరకూ ప్రతీక్షించాను. ఇప్పుడు మీ నోటివెంటే ప్రాణాలు తీస్తాననే మాటకూడా వింటున్నాను. నమ్మించారు. నన్ను వంచించారు. నిజంగా నన్ను వంచించారు. చంపడానిక్కూడా సాకులు చూస్తున్నారు. చంపండి. నన్ను మీ చేతుల్లోనే చంపండి. ప్రాణాలు విడుస్తాను. ఆనందంగా మీ ఒడిలో ప్రాణాలు విడుస్తాను. ఆపాట పాడుతూనే ప్రాణం విడుస్తాను.

సీ త మ్మ

చెల్లీ ! నా మాట విను చెల్లీ !!

వెం క ట్రా వు

సీతా ! చాలించు. నీ జోక్యం ఇహ చాలించు. వుండు. దూరంగావుండు.

సు శీ

అక్కయ్యా ! అక్కయ్యా !! అంతా మోసంగావుంది.

వెం క ట్రా వు

పాడకుండా అలాచూస్తావేం ?

సు శీ

పాడుతున్నాను. స్వేచ్ఛగా పాడుతున్నాను. సంస్కృతీ సంస్కారాల చవిచూచేవరకూ పాడతాను. ప్రతీక్షాఫలం దక్కేవరకూ పాడతాను.

( పాట )

కరుణించువా రెవరు కనుచూపులో లేరు.........

(వెంకట్రావు సుశీ చెంపపై కొడతాడు. సీతమ్మ అడ్డం వస్తుంది. ఆ ఉద్రిక్తతలో సీతమ్మను కొడతాడు. "అత్తయ్యా!అత్తయ్యా!! అని సీతమ్మ పెద్దగా అంటుంది. సుశీ పాడుతూనే వుంటుంది. రామాయమ్మ, జనార్దనరావులు వస్తారు, సుశీ పాట ఆపేస్తుంది.)

రా మా య మ్మ

పోయింది. అంతా పోయింది. అంతులేని ఆనందానికి అవధిలేకుండా పోయింది. ఇంకేం ? వింటారు. అందరూ

వింటారు. అంటారు. అధముడై తేగాని ఆడదాన్ని చేయి చేసుకోడంటారు. అయిపోయింది. సంసారం నడివీధిలో నవ్వులపాలై పోయింది.

## జనార్ధనరావు

సత్సాంప్రదాయంలో పుట్టావు. ఒక్క సాంప్రదాయమూ పాటించలేదు. మామాట ఒక్కటీ వినిపించుకోలేదు. ఆనందానికి అంచులు చవిచూడాలనుకున్నావు. చేయకూడనిదీ, వినకూడనిదీ చేసి చూపించావు. అందరూ అసమర్ధుడంటారు. నీ క్షేమంకోరినవారేనీది కూడని పనంటారు. ఆపండి. ఇహ ఈ అరుపులూ, పెడబొబ్బలూ ఆపండి. పదండి. ఇప్పటికి ఇక చాలించండి.

## సుశీ

వెళుతున్నాను. అన్నీ అనుభవించి వెళుతున్నాను. ప్రతీక్షాఫలం పొందే వెళుతున్నాను. అనండి. అనుకోండి. మీలో మీ రేమన్నా అవండి. వెళుతున్నాను. (వెళుతుంది.)

(వెంకట్రావు విచారంగా చూస్తూ లోనికి వెళుతుంటాడు. సీతమ్మ దుఃఖంతో తలవంచి కాలి గోరుతో నేల గోకుతుంటుంది. జనార్ధనరావు, రామాయమ్మలు ఆశ్చర్యంగా చూస్తుంటారు)

( తెర )

సమాప్తము.